గీ॥ అనుచు కైకబలుక నాసుమంతుడంత। రాముపాలికేగి రయమున తోడ। విన్నపంబుసేయవిని రామచంద్రుండు। తలచె చిత్తమున నుతం త్రి జూడ॥

క॥ తేరెక్కి రామచంద్రుడు। వారణరథహయభటాదివర్గంబులతో। చారుతరవైభవంబున। చేరంజనె కైకగృహము శ్రితలక్ష్మణుడై॥

వ॥ ఇవ్విధంబున రామచంద్రుండు కేకయరాజనందన గృహంబు కడకుంజని రథంబుదిగి లోపలికింబోయి విషాదంబున కన్నీరు నించుచున్న తండ్రింజూచి భయపడి కైకేయికి వందనంబుగావించి తల్లి మాతండ్రియగు దశరథుండత్యంత విషాదంబున వివర్ణముఖుండై యున్నవాడు యేనజ్ఞానవశంబున నపచారంబులెవ్వియు జేయంగదా యనియడిగినం గైకేయియిట్లనియె॥

ద్వి॥ వినవోయి శ్రీరామ విశదంబుగాను। మునునాకు మీతండ్రి ముదము రెట్టింప। వరయుగంబొసగెనావరములీవేళ। కరమొప్పనిమ్మనగానిత్తునన్న। నినుపదునాల్గేండ్లునియతితో ఘోర। వనవాసమొనరింప వరమతినొకటి భరతునకింపుగా పట్టంబుగట్ట। గరిమెనొక్కటి వేడఘనవిషాదమున। నీకప్రియము బల్కనేరకనిట్లు। భూకాంతుడున్నాడు పోలుపొందనీవు। జనకునిసత్యంబు చక్కగానెరపు। తనయుండవైతే నితగసేయుమనుచు। బలుకంగవిని రామభద్రుండు భక్తి। వెలయంగ నంతట వెలదికిట్లనియె॥

భైరవిరాగము - ఆదితాళము;

జననిరో నీయాజ్ఞ దప్పనెవో॥ యమ్మ వినవె। జననిరో జనకుని సత్యవ్రతుని సేయనిసుతుడేల। నీచరణములానసమ్మవమ్మ వనభూమి। కేగుదు నింక వరములు యాచింపవలెనా। యీకార్యమీవు గరిమ సెలవివ్వ జేయనా। భరతుడు తమ్ముడతండు గరిమెతో రాజ్యమేలగ। నరవరలేమున్నవమ్మ। పరమసంతోషమె కాదా॥ జన॥ జనయిత్రి నీకరుణ వలనను। మునికోటిపదవందనములునాకబ్బునింకనూ॥ మునివేషము ధరియించి వనవాసమొనరుచు సర్వ। మునులునన్నురంగధాముడను చు ప్రస్తుతింపుచుండ॥ జననిరో నీయా॥

క॥ అనియిట్లు బలికిపీటొక్కని। ఘనమతి శ్రీరాఘవుండు కడువడిజని కొంకక। తనతల్లి యింటికయ్యెడ। మునుకొనిలక్ష్మణుడు దీనముఖుడై గొలువన్॥

వ॥ అంతటనంతఃపుర స్త్రీజనంబుల యార్తస్వరంబులు ఘోరంబుగా మ్రోయుచుండె నా సమయంబున శ్రీరామచంద్రుండు లక్ష్మణసమేతుండై కౌసల్యపాలికిబోయి పట్టాభిషేకంబునిర్విఘ్నంబుగా నేపడుటకై గ్రహశాంతులును హోమంబులును దేవపూజలుగావించుచు పరమానందంబునవర్తించుచున్నతల్లికివందనంబుగావించియిట్లనియె॥

మధ్యమావతిరాగము-ఆదితాళము.

యేమియరుంగనిదాన నేతల్లి। యేమని వివరింతునేమతిజెల్లి॥ యేమోమోదముతోమించుచునా। క్షేమము జూడగ వేమరుగోరెద వేమి॥ గొనకొని కైకవరంబునకేను। వినుతిగలుగుమునివేషముతోను। వనమునపదునాలుగువత్సరములు। ఘనమతినేవసియింపగవలెగాను॥౧॥ మరియొకవరమునకరుదారగను। భరతుడుధరణీతలమేలగను। గరిమనిట్లుచేకూడెనుపోమోద। వరరంగపురీశ్వరుడనిపొగడగ॥ యేమియెరుగని॥

వ॥ అనియివ్విధంబునంబలికిన॥

గీ॥ మొదలుగొట్టదెగినకదళికాభూజంబు। తెరగుదోపధరణినొరగిమూర్ఛ। జెందితెలిసిలేచిశ్రీరమ్యమగురాము। మోముజూచిశోకమునమునింగి॥

శోకవిరాళిరాగము-అటతాళము.

యొక్కడివనవాసగమనమువచ్చెనుచక్కనినాతండ్రి। నిక్కమొకొల్ల యోనిజమనినమ్మరి। పక్కజముగకల్లలాడనేతుగవెతండ్రి॥ యొక్క॥౧॥ ఘనమగుయభిషేచనవిఘ్నములునీకుగలుగకుండునట్లుగా। పనిబడినేజేయుబహుహోమశాంతులు। నినుబ్రోవలేవాయగా శ్రీరామా॥౨॥ నామోహనపుపట్టినాపెన్నిధానమనాముద్దురఘునందనా। యేమనిజెప్పదునీమోహశోకమునేమనిజీవింతునీమోముజూడక

క॥ ౨॥ యిరువందసంతతిలేనిదుఃఖమునన్నింత తాపము సేయదగూ ॥ వరరంగధామనీ వెనువెంటవచ్చెద।నరమరచేసినధరణిజీవింపనూ ॥ యెక్కడివనవాసగమనమువచ్చెనూ॥

సీ ॥ అంతట లక్ష్మణుండాయమ్మవిన రామచంద్రు గన్గొనిసుప్ర శాంతుమాటికి। నడవికినేగంగనాడబడివచ్చితివన్న నీవిదియొప్పన హాఁ మగునె। చెలగినిన్నభిషిక్తుచేసెదననితండ్రి మదనాతురముఁన నమ్మాటదప్పె। జనకుండుఘనమాగఁమనురక్తిచెప్పిననొప్పంగద గుదీనియొప్పదగునె।యేనయోధ్యనునిజఁనగానొనత్తుఁ।నెలవుకరు ణింపుమనరఘుశ్రేష్ఠుడంత।జనకువచనంబుదప్పంగజనదునాకు।వన ములవసింతుపదునాల్గువత్సరములూ॥

చ॥ అనియిటుబల్కితల్లి వినిహారఘునందనరామచంద్రపా।వన మునికోటివంద్యనతవత్సలదీనశరణ్యపద్మలో। చనభవచాపఖండన ప్రసన్నముఖాబ్జకుమారనన్నుబా।యనిదయబ్రోవవోయిశరణా గతపోషణశత్రుశోషణా॥

అసావేరిరాగము-అటతాళము.

యెన్నోనోములునోచినిన్నునేగన్నదియీవనవాసముకా ॥ నిన్ను జూడకయరనిమిషమోర్వగజాల। కన్నులజూడుముకరుణచక్కని తండ్రి॥౧॥ఆకైకతనభర్తఁచేకొనిమన్నింపమాకంటెనెక్కువగా। శ్రీకరవైభవ చిన్నెలగోరకనీకేలవనవాసనియతిగోరెనుపుత్ర ॥ ౨ ॥ అందరుసుఖమతినుండగనీవేలజెందగారెదువనమూ।యెందు బోవలదునాయాజ్ఞగైకొనుమికకందర్ప శతవేష ఘనరంగపుర వాస ॥ ౩ ॥ యెన్నోనోములునోచి నిన్నునేగన్నది యీవన వాస ముకా॥

ద్వి॥ వినుముశ్రీరఘురామవినవోయిపుత్ర।నినుబాసిప్రాణముల్ నిలుపంగజాల। నిండుచందురుబోలునీమోముజూడ। కుండంగనే తుఁనేకుమతియైనట్టి। సవతియాకైకకురుఘుడియంగనేర। ప్రవిమల మతినిన్నుబాయకవత్తు।ననియిట్లుబలుకంగనమ్మతోరాము। డనియె నీవనవాసమతిలీలగడపి।వేగవచ్చెదతల్లివిడువుముదుఃఖ।సాగరమ్ము నబొందజనవలదింక।ననిహితోక్తులునీతినమరంగజెప్పి। జనయిత్రిక

ర్మ్యాదసాగిలిమ్రొక్కి । అమ్మనీకొమరుండనగునట్టినన్ను।సమ్మతిదీవించిసదమలమతిని।బంధుమనంగయాపద్మపత్రాక్షి। పెంపునరక్షలుప్రీతితోఁబెట్టి।వరయంత్రములుగట్టివరుసదీవించి।గురుకరుణాబ్ధివైకొడుకుకిట్లనియె॥

మారువరాగము- ఆదితాళము.

పోయిరానాయన్ననీవుపోయిరావోయి।బాయకయింద్రునకదితి।బల్కినమంగళములెల్ల ।వేయువిధములనిన్నట్టి।విపినవిధులరక్షించు॥పో॥౧॥గరిమతోడుతసమ్మతము।గరుడుడుతేబోవువేళ। గురుతగానవ్విసుతబలికు।కుశలమునిన్నేరక్షించు॥౨॥ ధరణిలోఁబాలురనెల్ల ।తల్లులుదీవించిపల్కు। నిరుపమకళ్యాణములు।నిన్నుజెంది బ్రోచునింక॥౩॥భీకరారణ్యములజాగ।రూకుడవైవెలసిరమ్ము।శ్రీకరరంగేశుడనుచు।నాకవాసులెల్లబొగడ॥౪॥పోయిరా॥

వ॥అనియివ్విధంబుసదీవెనలొసంగిన॥

ఉ॥ ఆరఘురాముడంత।తనయంబనువిట్కొనిలక్ష్మణుండు।పెరాపారగభక్తిగొల్వ। నిజభవ్యనివాసముకేగిసీతతోఁ।ధీరతసర్వముక్తెలిపి।దీనతనొందకుపోయివచ్చెదం।భూరివివేకమొప్పవనభూమికిభీతకురంగలోచనా॥

వ ॥ ఇట్లుబలికినం వినివైదేహి నితాంతదురంతశోక వ్యాకులితచిత్తయై నేత్రాబ్జంబులం వెడలుసాంజన బాష్పంబులవలన కనకకుచకలశంబులునిండింపుచు రత్నకంకణాద్యలంకృతంబులగుకరాబ్జంబులుసాచి ప్రాణవల్లభుండగు శ్రీరామునిం కౌగిలించుకొని దేవా నిన్నుంగూడి వనంబునకు వచ్చెదనీ తోటి వియోగంబున కోల్లనని బలుకుచున్న ప్రాణవల్లభి ననునయ వాక్యంబుల నూరడింపుచునిట్లనియె॥

అసావేరిరాగము-అటతాళము.

నీవెంతోసుకుమారివె। కారడవులనిలువలేవుమానవె॥వోవల్లభివినవెవనవాసము।భావింపజనులకుపరమాయాసము॥నీ॥౧॥ కరిసింహ ములుమించునె।శార్దూలములరుమగవిహరించునె। శరభభల్లూకవానరఖడ్గభీకర।గురుతరధ్వనులచేగుండెలవియుచుండు॥౨॥ నీవెం॥ఫలమూలములుదినుచూ। శీతాతప।బాధలెల్లనుబడుచు। శిల

ఘకంటకములుగలదుర్గమములునెక్కి। తలిరుబోణిరో దుఃఖతాప
ముబడతేవు॥౩॥ నీవెం॥ ఘనతరసర్పములు। రాక్షసకోటిగావించు
గర్జనలు। వనములనమరు రావలదు శ్రీరంగేశు। డనన్నో ప్పనా వాక్య
మునకనుకూలింపు॥౪॥నీవెంతో సుకు॥

వ॥ అనియివ్విధంబున నంబలికిన ప్రాణవల్లభునకు వైదేహియి
ట్లనియె॥

పున్నాగరాగము-అటతాళము.

నాథనిన్నెడబాయజాలనూ। రఘునాథనేత్తునీతోడను॥ సాధుపో
షణ నీచరణ సేవకురాల। బాధపెట్టకునన్ను బాసి మ్రొక్కెదనో
యి ॥౧॥ నినుబాసిపురినివసింతునా। యీతనుసుఖంబులకిచ్చయింతు
నా। వనమునగానిపట్టణమునగానినిన్ననుసరించియుండుటదెదివ్యవి
భవము॥౨॥ వనమృగభయములునన్నును। జెందవనఘునీవెనువెంటను
న్ననూ। ఘనరంగధామనిన్నెడబాయకుండిన। వనముగాదదిపట్టణ
మనభోలును॥౩॥నాథా॥

కందార్థములు.

అనియిట్లుసీతబలికిన। వినిరాఘవుడతివజూచివినవెసీవా। వనవా
స మెన్న డెరుగవు। ఘనమతినీవిచటనుండు। కామినినామాటవినవె
భామినీ। మనమున నన్నుదలంపుచు సత్తలకనురక్తినిపనులొనరగాసే
యుచు కామినీ॥

వ॥ఇట్లుబలికినసీత॥

క॥ మునుసత్యవంతువెంటను। ఘనమతిసావిత్రి జన్నకైవడినలు
నిం। వెనుకొనిచనుదమయంత్యాం। గన్నకైవడివెంటవత్తుకానకనూ॥
నామీదనలుకమానకు। మనసిజసుందరమన్నన బ్రోవుము। కనికర
మించుముగమనమొనచేరద॥కానకనూ॥

క॥ పిరికితనమేలరాఘవ। పురుషాకృతిదాల్చినట్టిపాలతివటంచున్।
గురుతెరుగకమజ్జనకుడు। పరిణయమొనరించెనీకుభక్తిని। ననునిల్ల
బోకుమయుక్తిని। కరుణాకర శ్రీకరరంగేశ్వర। శరణంటినినీచరణాబ్జ
ములకు॥భక్తిని॥౩॥
గీ॥ యిట్లుబలుకుచున్నయిల్లాలిరాకకు। రాముడనుమతించె త్రి

మధనర|నంతలోనతమ్ముడన్నపాదంబుల| కెరగి యిట్టులనిరాకో కే దెలియ॥

శంకరాభరణము- అటతాళము.

అతిభక్తినిపాదద్వితయదాస్యముసేయనడవికేవచ్చెదరాఘవా|
హితమతితల్లులబ్రోచుచునిచటసమ్మతినుండగదవోయిలక్ష్మణా ॥
౧॥ఘనతరబాణబాణాసనములుదాల్చివెనువెంటవచ్చెదరాఘవా॥
వనమునవసియించువలపేలయాభరతునిగూడి భువినేలులక్ష్మణా ॥
వలనొప్పనన్నురావలదనినిలిపిన నిలువదీదేహముగాఘవా ॥ జలజనాభుడరంగనిలయుడనాబుద్ధిపలుకులువినవోయిలక్ష్మణా|౩॥

సీ॥అన్ననీవెనువెంటనరుదెంతునినుబాసినిమిష మోర్వనటంచు నెమ్మిబలుక| వినిరాముడంతతమ్మునిరాకకనుకూలచిత్తుడై చెచ్చెరసీతగూడి| ధనభూషణాదులుతగసుయజ్ఞాదులకనురక్తితోనిచ్చివినుతివడసి|జానకిలక్ష్మణసహితుడై వేంచెసియాకైకమందిరంబప్పుడుజొచ్చి| తానువచ్చినవార్తయాదశరథునకు|చెప్పిపంపంగ వినిరాజుచింతతోడ|సూతునవ్వేడగన్గొనిచోద్యమలర| పల్కెనిట్లనియతనితోపార్థివుండు॥

ద్వి॥సలలితంబగురామచంద్రునిమోము|వెలయనేనొక్కండవీక్షింపజాల|నావెలందులనెల్లనయమారనిటకు|వెవేగబిలుచుకవెలువడిరమ్ము|పొమ్మనిబలుకంగపోయిదోడ్తేర|కొమ్మలందరువచ్చిగూడిరంతటను|జనకజాలక్ష్మణసహితుడైనట్టి|తనతనూజశ్రేష్ఠధర్మజ్ఞననఘు| శ్రీరాఘవేంద్రునిసీతాహృదీశు । కూరిమి బిలుపించిగొనకొనిరాము|మోముగన్గొనిచాలమూర్ఛయమునింగి| హాహాహానాకారహాదయాసాంద్ర|హారామహారామహారామయనుచు| నీరీతిదుఃఖించెనెలమియానృపతి॥

శోకవిరాళిరాగము-అటతాళము.

నారీజనులుదుఃఖమొందిరి|సారెసారెకుమూర్ఛలనెందిరి॥ వారకతమకుహృద్వల్లభుడగురణధీరుడౌదశరథభూరమణునిగూడి॥
నా॥శ్రీరామచంద్రునిచేరికౌగిలించి| హారామహారామహారామయనుచును॥౧॥కరమొప్పకన్నుదామరలకాటుకనీరు గురుతుగతమ

కుచకుంభములటునిండ॥౨॥విరివిగయారాఘవేంద్రుని చెక్కిళ్లుక
రమొప్పదువ్వుచు కానకేగకుమని॥౩॥ వరరంగధామనీవారము మే
మొల్ల నిరతమునిను బాయనేరలేమనుచును॥౪॥ నారీమణులు॥

వ॥ ఆసమయంబున॥

క॥తనపుత్రుఁజూచిదశరథుఁ।డనియెఁ వనగమనమేలనాత్మజనీకుం।
ఘనమతిరాజ్యముసేయుము। మునిగణములుబంధుజనులు మోదం
బందఁ॥

శుద్ధకాంభోధిరాగము- ఆటతాళము.

నీమోముజూడకనిమిషమోర్వలేను రామచంద్రా ॥నిండుప్రేమ
తోనిలిచినీమోముజూపుచునుండు రామచంద్రా॥కనికరమిసుమంత
కలుగదాయనీకు రామచంద్రా॥ నీవువనమూలనుండయీ ఘనభో
గమెవరికి। రామచంద్రా ॥౧॥ ననుగన్నచక్కని నామగ్గుతండ్రి వి।
రామచంద్రా॥ నిన్నుగన్నకౌసల్యకేమనిదుఃఖముఁడీపెదో। రామ
చంద్రా ॥౨॥ హారామహారామహాగుణస్తోమ శ్రీరామచంద్రా ॥
రంగధామనిశాటవిరామనన్నేలుము రామచంద్రా॥౩॥నీమో॥

వ॥ అనియివ్విధంబున దుఃఖించుతండ్రినూరార్చిఁ కైకేయి దె
ప్పించిన నారచీరలు సీతాలక్ష్మణ సమేతుండై ధరియించె నాసమ
యంబున శోకవిహ్వలుఁడగు దశరథుండు తనకోడలికిసకరత్న
భూషణ దివ్యాంబరంబులు దెప్పించి యొసంగెనంత శ్రీ రామచం
ద్రుండు సీతాలక్ష్మణ సమేతుండై దశరథకౌసల్యా సుమిత్రా కై
కేయి ప్రముఖులకునువసిష్ఠునకుం ప్రదక్షిణ నమస్కారంబు లొన
చిఁ వెడలు సమయంబున లక్ష్మణుండు తనతల్లియగు సుమిత్రం
గనుంగొనిపోయివచ్చెదననివిన్నవించినకుమారుంగౌగలించుకొని
శిరంబాఘ్రాణంబుగావించియిట్లనియె॥

యదుకులకాంభోధిరాగము.

పోయిరావోయితండ్రి పోయిరా॥భక్తిబాయక నేవేళ రామభ
ద్రుసేవసేయుచు।పోయిరా॥తనుసుఖములకిచ్ఛయుంచకుమీ। ఘోర
వనమూలధనువు నెక్కుడించకు।చాలమనసూ శ్రీ రామపాదవనజ
ములందయుంచి॥పోయి॥రామునిదశరథుగానెంచుమీ।సీతాభా

మనుసన్ను గాదలంచుమీ।నీవు కామించివనమయోధ్యా శ్రీ ననడవిచెట్ల । లక్ష్మణ ॥౨॥ పో॥ యి॥ఫలమూలములు దెచ్చిపెట్టుమీ।రాణ్నాదెనోన నణశాలలుగట్టుమీ॥యిరువు రలసినిద్రించు వేళ నెలమి కాపాడు॥ఘను నుచు॥పో॥ యి॥౩॥ నాయన్న నీకుబుద్ధి జెప్పితి।కోరి।నీయన్న వెంటబో వనొప్పితి। రంగ నాయకుడై నసీతానాయకు ననుసరించి ॥ పోయి రా॥౪॥

వ॥ ఇవ్విధంబునం సుమిత్రాదేవి తనకొడుకునకుం బుద్ధివాక్యం బులు జెప్పిపంపిన యనంతరంబున శ్రీ రఘు వరుండు సీతా లక్ష్మణ సమేతుండై సుమంతుండు దెచ్చినరథంబునం గూచుణండి వనవాస గమనోన్ముఖుండై వెడలి రాజమార్గంబునంజను చెంచు సమయం బునా॥

యదుకులకాంభోధిరాగము దేశస్తి- ఆదితాళము.

యెంతాదిక్కులేదాయ నెయీ పట్టణమునా।యింతిరొ యేమమ్మ కైకయంతదలచి తేచంతాయ॥యెం।పట్టాభిషేకమటంచు వట్టియూ తాబెట్టిరాజు।పట్టిసిపిల్పించిపురమట్టి వెళ్లగొట్టినాడు॥యెం॥౧॥రా మునికళ్యాణగుణస్తోమునిసుందరమేఘ।శ్యామునియడవికంపి రేమ మ్మయీద్రోహబుద్ధి॥యెం॥౨॥ మందయానరొ మందరయందుండి వచ్చునో।దీనిక్రింద ద్రోచిచంపిన గానిందీరదో యమ్మదోస ॥ యెం తదిక్కు॥౩॥ శ్రీకరరంగేశుడైన శ్రీరామచంద్రునకిట్లు।ఆకైకకీడు గావించితాకడ కేమెత్తుకపోనో॥౪॥యెంతదిక్కులెదాయనో॥

తోడిరాగము- ఆదితాళము.

రారెపోదాము ప్రేమమీరనూ।మనరామభూపుత్రికలతోడనూ వోరామలారమన శ్రీరాముడడవికేగ। నేరీతితాళగలమీ రాఘవేం ద్రునిబాసి॥రారె॥సౌమ్యలింకేలధరియించనూ। సౌఖ్యమ్ములింకేల ననుభవించను।అమ్మచల్ల శ్రీ రాముడడవికిపోనాయగ।దమ్మమెత్తని చరణమ్ములసీతతోడ॥౧॥అదుగొ చూడారె రామచంద్రుడు।తమ్ము డుసీతగొల్వగుణసాంద్రుడు।యడవికేగుచున్నాడు।పడతుకలార యింక।తడవేలనమ్మ రంగధాముసికి మ్రొక్కుచు॥౨॥

శా॥ఊరీతింపురకామినీమణులునన్యేందీవరశ్యాముశ్యం। గారా

కుచకుంభములక్షీజనేత్రు విలసత్కల్యాణచారిత్రు। సీతా రమ్యాననపద్మ
రమొప్పదుప్పు-శాంతారణ్యయాత్రోన్ముఖుం। శ్రీ రాముంభవదూరునిం
పెల్లనిశుమహాచింతం బ్రలాపింపగనూ॥

వ॥ఆసమయంబునా॥

సీ ॥ దశరథేంద్రుండునుతల్లులుతనవెంటననతిదూరంబుతారరు
గుదేర। పురజనావళులెల్ల కరమొప్పగుమిగూడి హారామహారామ
యనుచుగదియ। జనకజాలక్ష్మణసహితంబుగాసూర్యసన్నిభంబ
గురధస్థలినివెలసి। దీనజనంబులదెసజూచినిలునిలుండికపోయివచ్చె
దనింపుతోడ।ననివచించుచుయాసుమంతునిరథంబు।శీఘ్రముగ బో
వనిమ్మనిశివవిరించి। సన్నుతుండగుశ్రీరామచంద్రుడపుడు। వనని
వాసంబునకునేగెననఘచరితా॥

వ॥ అంతదశరధుండుకౌసల్యాకులంగూడిచనుదెంచుచురాము
నింగదియడగ్గరనేరకకన్నీరునించుచుహస్తంబెత్తియిట్లనియె॥

నాదనామక్రియరాగము-ఆదితాళము.

నిలువవోయి।బంగారుతండ్రి॥శ్రీరామరామా నిలువవోయి॥
చెలువమమరునీనగుమొగమునుగనవలపగుచున్నదిజలదశ్యామ॥ ని
లు॥పలుకవేలా।శ్రీరామనాతోనలుకలేలా।నిలువకనీవిటువనమున
కరిగిన।నిలుచునెనాతనువిలపైపుత్రా॥౨॥చింతబాపు।నీముఖమికర
వ్వంతజూపు।సంతతమునురంగస్థలివెలసినచింతితకల్పక శ్రీరఘురా
మా॥నిలువవోయి॥౩॥

వ॥యివ్విధంబునంబలుకుచునధికదుఃఖావేశంబున ధరణిపైబడి
మూర్ఛిల్లి లేచిశ్రీరామచంద్రుండు జనినమార్గంబునం దృష్టి
నిలిపి రథపరాగంబు గాంచుచు కైకేయిని నిందింపుచు మరలంజ
ని కౌసల్యా గృహంబునంజేరి శయ్యపైశరీరంబువైచికౌసల్యంగ
నుంగొనియిట్లనియె॥

పున్నాగరాగము-అటతాళము.

యేమిదోచదేమిసేతునె।వినవెకౌసల్యా। యేమిదోచదేమిసేతు
నె।యేమిదోచదేమిసేతుకోమలసుందరమేఘ।శ్యాముడై వెలుగొం
దు శ్రీరఘురాముడిపుడెందున్నవాడో ।యే॥ యింతకెంతదూరమే

గునో। శ్రీరామరత్నమింత కెంత దూరమేగునో॥ యేయడవి చెట్ల।
చెంతలవతిలంపజూచునో॥ యింతిరో జానకీముఖమెంత వాడెనో న
దిజూచికాంతుడౌ శ్రీరామచంద్రుడెంత చింత జెందెనో॥ నాకేమి
దోచదేమిసే॥౧॥ కైకవరమెంత జేసెనే। నాపట్టికరుణలేక నన్నువీ
కెచాసెనే। ఆకలిదప్పులకెంత వ్యాకులమొందుదురో నాయవివేకమె
ల్ల దలంచిలక్ష్మణుడేకరణి దూరుచునుండునో॥ యే॥౨॥ కన్నులనేరీ
తిగాంతుము। రాముని జేరి। యన్నటికి కౌగలింతునే। సన్నుతాంగిరం
గపురస్వామియై వెలసిన సన్నగన్న పెన్నిధానమైన చిన్ని రఘువరే
ణ్యాబాసీ॥ యేమిదోచదేమిసేతునే॥

వ॥ యిత్తెరంగున దశరథుండధిక శోకాయత్తచిత్తుండై యుండె పురజనంబులు రఘువరుతోడంజని తమసాతీరంబున వంచితులైమరలిపురంబు ప్రవేశించి రంత రాఘవేంద్రుండు గంగాతీరంబున శృంగిబేరి పురసమీపంబున నున్నయొక్క హింగుదివృక్షంబు చెంత జేరి వసియించి యున్న సమయంబున నిషాధాధిపతియగు గుహుండు శృంగిబేరి పురంబు వెడలివచ్చి సీతాలక్ష్మణసమేతుండగు శ్రీరఘువరేణ్యునిచరణకమలంబులకు మ్రొక్కి యిట్లనియె॥

సౌరాష్ట్రరాగము- ఆదితాళము.

మునివేషములు బూననేల। ఘోరవనమార్గములను రానేల। జన
కనందనతోడననుజుని గూడుక। జనుదెంచుటదియేమి జనవర్య దెలు
పుమా॥౧॥ నారచీరలు గట్టనేలా। భూనాయకత్వము మాననేల। కో
రిమీకెవ్వరీకుత్సితమొనరించినారు జెల్పుము। రఘువీర ద్రుంచెదవా
రి॥ ము॥౨॥ దాసుడనై తినినీకు। రంగధామ యభయమిమ్ము నాకు। భూ
సురసముదయపోషణపట్టణవాససౌఖ్యంబులు వర్జించి చయ్యన॥
౩॥ మునివేషములు బూననేల॥

గీ॥ ఇట్లు గుహుడు బల్కనినకులోత్తముడైన। రాముడతనిజూచి
ప్రేమదనర। కైకవరమువలన కానకువిచ్చేయు। కథనెరుంగ దెలిపె
కరుణతోడ॥

వ॥ అంతట గంగాతీరంబున రఘునందనప్రముఖులారాత్రి వసియించి మరునాడు రామచంద్రుండు సుమంతుంగని నీవయోధ్య కర

థంబుగొనిపోమ్మనినతండుబాష్పపూరితనేత్రుండై యిట్లనియె॥

యరుకులకాంబోధిరాగము- జంపెతాళము.

రామ నేనీశూన్యరథముతోడనయోధ్య। కేమనుచుబోదుసీతారామ శోనాథా ॥౧॥ యీమహారథముసందీవులేమికిజన।స్తోమములునను ప్రేమమానితిట్టుదురు॥౨॥చరణసేవకుడనై వెనువెంటనరుదెంతు। కరుణ బ్రోవుమనఘసత్యభాషా॥౩॥ గరిమతోడుతరంగపురని వాసుడవైన।వరరాఘవేంద్రసుందరదివ్య వేషా॥౪॥ రామనేనీశూ న్యరథముతోడనయోధ్య కేమనుచ ॥

ద్వి॥అనియిట్లుబలుకంగనదివినిరాము।డనునయవాక్యంబులతనికి జెప్పి। బనుపంగనతడేగెబహుదీనుడగుచు।నినకులోత్తముడంతనం ఘుతోడుతను।తనసహోదరుతోడతెగజడల్బూని। ఘనమతిగుహు డుచక్కగనాడగపంప। తానుసుతమ్ముండునిరుగెసీతయును। పూని భాగీరథిపొలుపొందదాటి।గహనాంతరానెలవిచ్చికొనుచొప్పనంత। సహజుండుతానునుసతియునునడచి।ఘనభరద్వాజుని గాంచిసేవిం చి।వినయంబుగనుమునివీట్కొనితన్ను।శ్రీకరంబగునట్టిచిత్రకూటం బు ప్రకశగ నతిమెప్పచేరెనంతటహ॥

సీ॥ కదళికాఖర్జూరఘనగసాలలవంగసరళాదిబహువృక్షచ యముగల్గి।సనాదకోకిలకీరషట్పదశారికానికరస్వనంబులసవ్వడిల్లి। మందాకినీపద్మబృందగంధిలచారుమారుతముతో పొందుదన రి।ఘనహోమధూమసంకలితనైవరలొగినపత్రపూర్ణమై మొన సియున్న। చిత్రకూటమహారమ్యసీమవిధము। సీతకేర్పడజెప్పుచు చింతలేక।చారుతరమగుయొకపర్ణశాలలోన। మునులుమైత్రినివె లసిరిముదముతోడ॥

వ॥ అంతసుమంతుండు రథంబుతోడ నయోధ్య పురంబునకేగికౌ సల్యాగృహంబుననున్న దశరథునిం దర్శించి రామవృత్తాంతంబు చెప్పి యూరడించిన యా నరేంద్రుడధిక దుఃఖావేశంబున కౌస ల్యాదులంజూచి పూర్వంబునతనకుసంప్రాప్తంబైనశాపవృత్తాం తంబుచెప్పి రామలక్ష్మణసీతరాములందలంచి హారామహారామే ని వాక్యంబులుబలుకుచు దివంబునకుం జనియె నంత కౌసల్యాదుల

ధిక దుఃఖంబున విలపించిరా సమయంబున వసిష్ఠుండు దశరథన్నృపతి దేహంబు తైలకషాయంబు చేయించి సింహాసనంబునంగూచుండఁ బెట్టి యనంతరంబున భరతశత్రుఘ్నులం దోట్కొనిరమ్మని నలువురమంత్రులం బనిచిన వారలతిత్వరిత గతి కేకయ రాజు పురంబున కుంజని యంతకుమున్ను దుస్స్వప్న వృత్తాంతంబు తగిన జనులకు చెప్పుచున్న భరతుంగాంచిమిమ్ముల వసిష్ఠుండు దోట్కొనిరమ్మనిబంచినం జనుదెంచితిమనిపల్కిన తత్క్షణంబు కేకయ రాజు చేత ననుజ్ఞగొని శత్రుఘ్నసమేతుండై రథంబెక్కి వెడలిచనుదెంచుచు॥

క॥ గిరులువనంబులునదులును। పురములుపల్లెలునుచాలపోవఁగఁగడచిశ్రీ।కరుఁడగుభరతుఁడుగనుగొనె।సరుదారఁగ కాంతిహీనమయిన యయోధ్యన్॥

వ॥ ఇట్లు రామ వియోగాది కారణంబుసంజేసి యుదర్శంబొంది కాంతి హీనంబైన పురంబు గనుంగొని కంప మానగాత్రుండై సారథింజూచి యిట్లనియె॥

శోకవిరాళినాగము-అటతాళము.

యేమిదోచదాయెను।శ్రీమదయోధ్య।నియ్యెడజూచిననూ। యేమిదోచకయున్నదేను వివరింతు । నీమహాపురలక్ష్మి కేమొ దుర్దశగల్గె॥శ్రీనుంచువాద్యము లేమియువినరావు। నానావిధసత్పురుషులొక్కరుగానబడరెందు। సామజరథహయధ్వానముని వింప। నేమిసేయుదునింక నేమివాటిల్లెనో॥౧॥ పరిసరవిషములసు। గుచ్ఛకుసుమములరుమగగనుపడెనూ।తరుచుగతను వెళ్ళితాపమూచున్నది। బరువడి భయముసంభవమగుచున్నది।వరబుద్ధియెన్నెన్నోవంకలబోచున్న దరలేక నెడమకన్నదరసాగుచున్న। దరువంచు రంగేశు కరుణ యట్లొకదా। సరగున నాగుండె ఝుల్ ఝుల్లమనుచున్న॥ యేమిదోచదాయెనూ॥౨॥

ద్వి॥ అనియిట్లుబలుకుచునతిదీనుడగుచు।చనిచనిపురిఁజేరిజనశూన్యమైన।ఘనరాజమార్గంబుకలయచూచుచును। కనకరత్నవితానకమనీయమైన।తనతండ్రినగరుచెంతను తేరుడిగ్గి। పనిబడి వేగలోపలికేగిజనకు।గానకనంతటకైకమందిరము।మానకవడిజొచ్చి మా

తనుగాంచి। మ్రొక్కినయాకైకమోదంబుతోడ। నక్కున జేర్చి తానతులితకరుణ।శిరమువూర్కొని కేలచెక్కిలిదువ్వి। వరపుత్రు తోడ।నవ్వనితయిట్లనియె॥

రేగుప్తి రాగము-ఆదితాళము.

క్షేమమమనవారికెల్ల। క్షేమమాపుత్ర।నిందుప్రేమతో నీమామయత్తలేమైన।నన్నడిగినారా॥ఖ్యాతిగలుగుకేకయభూకాంతుడుకళ్యాణమొప్ప।వీతకంటకము గతనభూతలమేలుచున్నాడె॥ క్షే॥౧॥
సామజఘోటకరథస్తోమములు బంధుజన। స్తోమము పౌరులు రంగధాముకరుణచే భద్రమె॥ క్షేమమా॥౨॥

క॥తనతల్లి కరుణతోడుత। తనవారలకుశలమడుగ తడయకకుశ।లంబని చెప్పిభరతుడంతట।జననింగని మరలబలికె సంతప్తుండై॥

శోకవరాళిరాగము-అటతాళము.

యేమిదోచదుచెప్పవె। అమ్మయ్యా। నాకేమిదోచదుచెప్పవె।రామరో దశరథభూమీశుడే డమ్మ।స్వామి శ్రీకోదండ రాము డెందు న్నాడో॥యే॥ వినుతసద్గుణుడగుచు। లోకములందువిఖ్యాతివహించుచు।నను ప్రేమజూచుమజ్జనకుడౌ దశరథ।జనపాలుడియ్యెడ గనుపడకున్నాడు॥యే॥౧॥పదములుతడబడెనే।నామదికే మోపటు భయమొనగూడెనె। పదపడి శ్రీరంగపతిదయయికనెట్లో కడమున్న కుసములువదలకదోచెను॥యేమిదోచదు॥౨॥

వ॥ అని యిట్లు వచనంబుసంబలికిన భరతుంగనుంగొని తల్లి యిట్లనియె॥

సీ॥భరతనీజనకుండు పదపడిమును రెండువరములిచ్చెనునాకువత్సతోడ।ఆ రెండువరములుచారుశీలుండైన శ్రీరామపట్టాభిషేకవేళ।యిమ్మనినేవేడనిచ్చితిసనియన్న నీకుపట్టముగట్టి నెమ్మినొకటి। మునివేషమున రాముడనురక్తవనముల పదునాలుగేండ్లుండ వరగనొకటి।యిట్లుగోరితినంతట నెలమిరాముడనుజసీతాన్వితంబుగానడవికేగ।పుత్రశోకాగ్నినలమటబొందిపోంది। జనియెనీతండ్రిసురరాజసదనమునకు॥

వ॥పుత్రా నీనిమిత్తంబున నింతనిష్ఠూరకార్యం బాచరించితింగావున నీవింక నిష్కంటకంబైన రాజ్యంబేలుమని పలికిన యుల్లం

బిఱ్ఱల్లన హస్తతలంబులం గర్ణరంధ్రంబులు మూసుకొని మొదలునరికినం దెగిపడుకదళీవృక్షంబునుంబోలె శోకావేశంబున ధరణిం బడి మూర్ఛిల్లి కొంత సేపటికిం దెలిసి నిట్టూర్పు నించుచు తల్లి కిట్లనియె॥

శంకరాభరణము-అటతాళము.

ఏంతఘాతకివె నీవెంత పాతకురాల వెంతదుశ్చారిణివె। యింత దుష్టాత్మకవనికలనైన నెన్నరుగనైతిగదవె॥ నను ప్రేమ బెంచుమజ్జనకుని పరలోకమున కేగ జేసితివి। జనయిత్రి నిన్ను జంపసనించుకంత యుజనియింపదికదోసము॥౧॥ శ్రీమన్మహాగుణస్తోముడైన రాముడే మితప్వానరించెనె। ఆమోహనాంగు శుభాకరు నడవికినేమిటికనిపితివె॥౨॥ చెనటిరక్కసురాలవీకార్యము నేనునిను సేయమన్నానటె। మునివరదుండ ఘనరంగధాముడు నామనసు దెలియలేడటె॥౩॥ యంత ఘాతికివె॥ నీవెంత పాతకురాలవెంత దుశ్చారిణివె॥

అసావేరిరాగము-అటతాళము.

యింత క్రూరకర్మమే రీతి జేసితివే మెవోకులపాంసిని। కాంతరోనీ వశ్యపతికన్యకవుగావు। యింత రక్కసురాలవిదితధ్యమనకున్న॥ యింత॥ శ్రీకర విమలకృపాకరు రఘువర్యు। లోకమోహనమూర్తిని। నీకెట్లనోరాడె నడవికిబొమ్మనసీకోరికెలెల్ల నిర్మూలమైపోను॥౧॥ రాముడు జగదభిరాముడగ్రజుడుండ రాజ్యమేలుదునటవె। రామభక్తి ధ్యానరంజితమగుచున్న నామానసవృత్తి నేమి దెలియలేక॥యింత॥ ౨॥ ధరణి నేజచ్చితి ననిదుఃఖమెుందుము తడయ నేలనింకనూ। ధరణి రామునకిచ్చియడవినిత్చె దనింకమరుదుగనామాట గురుతుగ మదినమ్ము॥మింత॥౩॥ కటకట నీగర్భమున నేనుగలిగితిపట్టపాపవశమునను। చటులదుఃఖమున కౌసల్యవివత్సయైనటియించు ధేనువనాగ యుండునుగదె॥౪॥ ననలబోలినజానకిచరణములు కాననములదిరిగగద। ఘనరంగధాముడై వెలయు రాముడుకష్టమనుభవించగలడట వెదువక్రృతశీల॥౫॥ యింత॥

ద్వి॥ భరతుడివ్విధమునపదపడి బలికి। కరముదుఃఖింపంగగనితమ్ముడంత। కనలి షంఘట్రద్రుంచి కైకనుగూర్తు। ననిఖడ్గమంకించి యా

గ్రహంబునను। కైకదాసిని క్రిందకడువడిద్రోచి। భీకరంబునదా
నిపీడించమణంప। నళియత్న మొనర్చించుటది గాంచిభరతు। డతనికిష్టా
త వాక్యమనురక్తిజెప్పి। వారించెనంతటవరసహోదరుని।భూరిశో
కముక్తపాపూర్ణచిత్తమున।భరతుడేతెంచుటపరగకౌసల్య। వర
మతిదెలసియువనితసుమిత్ర।నయ్యెడగాంచియోయమ్మయీపురికి।చ
య్యనభరతుండుచనుదెంచినాడు।కనుగొనివత్తమీఘనదీర్ఘదశిక
ననిపోవు వేళనయ్యెడకు శత్రుఘ్న। సహితుడై తల్లుల చక్కగా
జూచె॥

వ॥ ఆసమయంబున॥

ఉ॥ పారములేనిదుఃఖమున।పార్థివనందనులిద్దరయ్యెడం।ధారు
ణిమూర్ఛబొంది। మరితామెయొకింతకులేచిదీనతం।శ్రీరఘువర్య
మాతనటచెచ్చెరకౌగిటజొచ్చితల్లి నో। తీరని శోకతాపమెటుదీరిన
టించెదవమ్మనీవికనూ॥

వ॥ అనియిట్లుదుఃఖించుచున్న సమయంబున॥

గీ॥ భరతుజూచిపెక్కువడపడి కౌసల్య।వత్సనీకుకూర్మి వలనతల్లి।అ
ఖిలరాజ్యపదవియార్జించెగావున।నిచ్ఛదసర నేలుమింకజగతి॥

వ॥ మదియ్యనపుత్రుండు మునివేషంబు దాల్చి ఫలమూలంబులు ది
నుచు యరణ్యంబున యున్నవాడు యేను ప్రాణంబులునిలుపంజా
ల శ్రీరామచంద్రుండున్న యెడకు బంపుమని విలపించుచున్నం జూ
చి భరతుండు శోక విహ్వలుండై తల్లి కన్నీరు తుడచిపదంబులుబట్టు
కొనియిట్లనియె॥

రేగుప్తి రాగము-ఆదితాళము.

అమ్మనే ద్రోహిగానమ్మ। ననుకరుణజూడవమ్మ నే ద్రోహిగాన
మ్మ॥ శ్రీరామునిగన్నమ్మ। నే ద్రోహిగానమ్మ॥అమ్మపాపపుయీకై
కమ్మసుతుడనౌటచే।నిమ్మాటలనుటకుని మ్మైయున్నదిగాక॥అమ్మ॥ జ
ననీరో నేనీదుంతముమది నెరిగియున్నవినవమ్మ।సేయుశపథము। లన
ఘుడై నట్టి బ్రాహ్మణునిజంపినట్లు।మద్యమనురక్తి త్రాగినట్లు మొన
సినా కేసిద్ధించునమ్మ॥౧॥ గురుభామనంటికూడిన।వానిగతికిపురము
పొందజేసిన।నరునిగతికిపోదునమ్మరామునికీడు। నెరిదలంచితినే

నిక్కముఁ బల్కు॥నమ్మవమ్మ నే ద్రోహిగానమ్మ॥౨॥ నేరము నామీఁద నిలుపకుమా। దోషము లెఱుఁగ। నను నీపుత్రుని గాఁ దలపకుమా। ఘనరంగధాముఁడౌ పావన రామచంద్ర చరణ। వనజసేవకుఁడు దుఃఖవనధిమునిఁగినవాఁడ॥నమ్మ నే ద్రోహిగానమ్మ॥౩॥

పున్నాగరాగము-అటతాళము.

అమ్మ నమ్మవమ్మ। రాముల నుగన్నమ్మ। నమ్మవమ్మ॥ అమ్మ రాముని పాదమ్ములు హృదయాబ్జమ్మున నే వేళ నమ్మి గొలిచెటివాఁడ నమ్మ॥ అల రామునికి కీడు దలచి చేసితి నే నియిలఁగల బహుదోషములు నే జేసినవాఁడ॥నమ్మ॥౧॥ వనమున రాముఁడు వసియింప పట్టణంబుననుండి సౌఖ్యములనుభవించ నేర॥నమ్మ॥౨॥ రాముని జగదభిరాముని పట్టాభిరాముఁ జేసి వనసీమ నిలచెరఁ జూడవమ్మ॥నమ్మ॥౩॥ స్వామిని శ్రీరంగధాముని కోదండరాముని జూడకే నామానసము నిల్వదమ్మ॥ అమ్మనమ్మవమ్మ॥౪॥

గీ॥ కపటమింత లేక కడుదుఃఖమొందెడి। భరతు కౌఁగిలించి పరగ నంక। తలము జేర్చి శిరముతగ మూర్కొనియును। శ్రీరాముతల్లి బలికె ప్రేమవెలయ॥

శోకవిరాళిరాగము-అటతాళము.

సాటిలేని తండ్రిని బుద్ధి దెలియక మాటలంటి। నామాటలు మదిలోన నాటింపవలదు నీమమత గంటి। నినుజూడగను దుఃఖమినుమడించె నాకు నెమ్మితోను। శోకవననిధి సీదనావశముగాకున్నది నైపుతోను॥౧॥ ఘనరంగధాముని వలచి తండ్రికి సంస్కారమింక। నీవు పనిబూని సేయుము దుఃఖమొందక సద్భక్తినింకా॥౨॥

వ॥ ఇవ్విధంబున కౌసల్య భరతునూరార్చు సమయంబున వసిష్ఠుండు చనుదెంచి భరతుం గాంచి దశరథున కగ్నిసంస్కారాదులొనరింప విచ్చేయుమని పల్కినం భరతుండు శత్రుఘ్నసమేతుండై యంతఃపురంబునకుం జని తండ్రి కళేబరంబు గాంచి వసుంధరం బడి మూర్ఛిల్లి కొంతసేపటికిం దెలసి యో రాజకంఠీరవ యో రఘువంశ జలధిసుధాకర నాతో యేల భాషింపవు కేకయ భూపాలుండు నీనిమిత్తంబునం బంపిన భూషణంబులేల గైకొనవు కైకకొ

దుకుంగావున నాతో సంభాషింపనొల్లక నలిగి నట్లున్నయది శత్రు ఘ్నుండు దుఃఖించుచు నేలంబడి యుంనవాడతని యారాఘవుడు ని యివ్విధంబున విలపించుసమయంబున వసిష్ఠాదులు బోధించియూ రడించిరంత భరతుండు వసిష్ఠాను మతంబున విధ్యుక్తప్రకారం బులం తండ్రికి నగ్ని సంస్కారాదులొనర్చి విహిత ద్వాదశాహ కృత్యంబులు నిర్వర్తించి కృతకృత్యుండై నయనంతరంబున వసి ష్ఠుండు పట్టంబు గట్టుకొమ్మనిన నమ్మాటకు గైకొనక రాఘవేంద్రు నిం దోడితెచ్చి పట్టాభిషేకంబు గావించెద నమ్మహాత్ముండు రాకుండిన తదీయచరణారవింద సాన్నిధ్యంబున వర్తించెదనని పల్కియనం తరంబా సుమంత్రాదులం జూచి శ్రీరామచరణార విందసాన్నిధ్యం బునకుంజని సీతాలక్ష్మణసమన్వితుండగు యమ్మహాత్ముని దోడితే వలయుగావున సమస్తజనంబులకు పురంబునం బయనంబు చెప్పి సై న్యంబులం గూర్చి ప్రయాణభేరీ ప్రముఖ వాద్యంబులు చెలంగం జే యుమని యాజ్ఞ యొసంగిన వారట్లు చేసిన సమస్తజనంబులు శ్రీరా మచంద్ర ముఖసందర్శనకుతూహలకందళిత హృదయారవిందు లై యనేక విధంబులం భరతుని కళ్యాణగుణంబులు కొనియాడు చు తమతమగృహంబుల మంగళాలంకారంబులు గావించి మిక్కిలే సిభాగ్యంబు చేకూడిన చందంబున రథగజాశ్వ శకటాందోళికా ద్యారోహణంబులు గావించి గమనోన్ముఖులై రట్టియెడ॥

యరుకలకాంభోధిరాగము-ఆదితాళము.

రారంమ పోదాము సీతారాముల జూడను। రారంమ భరతుని
వంటి కారుణికోత్తములు జగతి। లేరంచు మనకెల్ల రఘువీరుని జూ
పింపగా రే॥ రా॥ వనులు దోచకుంనవంమ। మనసు చక్కని రాముని గ
నుగొనగోరుచుంనది। కనకరత్నభూషణములు మెరయగా॥ రా॥౧॥
జనకజావల్లభుడైన। స్వామి శ్రీముఖాబ్జమె ప్రో। వనజగంధిరో నాక
లను। దినదినమును గనుగొననౌచున్నది॥ రారంమ॥౨॥ భరతుడు శ్రీకర
రంగపురవాసుడై వెలయు రఘు। వరుని దెచ్చి పురముగట్టి। బిరబిర బో
వగ నేరిసిద్ధించెను॥ రారంమ పోదాము॥౩॥

క॥ అనియిట్లు పురజనంములు। ఘనమతినాకరొకరినాకరుకనిబిడ

చుచుచయ్యాన భరతుననుసరించిరి। మనమున శ్రీరాముగాంచుమను తదలిప్పుడు॥

వ॥ ఆసమయంబున॥

సీ॥ కరిబృంహితంబులుతురగహేషానాద మరుదుగారథఘట్ట నాదిరవము।లిరువొందవాద్యాదివరనిస్వనంబులుఘూసభంబులనెల్ల ఘోసగనిండ। హితబంధుజనపురోహితవసిష్ఠాదులుతగుయాన ములనెక్కితలిరాగ। తల్లులాందోళికా తలముల నొప్పార వెను వెంటతమ్ముండువెలయుచుండ। ఘనగధంబెక్కితనమనశికంజుసీమ। రామచంద్రపదధ్యానమేమరకను।భరతుడంతటవెడలెనప్పట్టణంబు। రాఘవేంద్రునిపట్టాభిరామునరయ॥

క॥ చనిచనిగంగాతీరంమున భరతుడునిలిచియుండ। మొనసియచటికిం బనిబడిగుహుడేతెంచియు।కనిలసదాయిలను జూచికడుపడిబలికెను॥

క॥ మునివేషమునరజేసియు।ఘనుడగుశ్రీరామచంద్రు కాననమునకుం।బనిపివెనువెంటసైన్యము। గొనిమరిపోవుచున్నవాడు। కుత్సితమతియై॥ చ॥ అనవినిశోకపూర్ణహృదయాన్వితుడై।భరతుండుపలికెపావనుడగు రామచంద్రు। నవవారిజ నేత్రు మహాత్మునగ్రజుం।పనిబడిపోయితెచ్చి తగపట్టముగట్టదలంచినాడ। నెమ్మనమునసింతెగాని।యొకమంత్రము మోసములేదుధీమతీ॥ ద్వి॥ అని యిట్లుబలుకంగనప్పుడాగుహుడు।వినిపరమానందవివశుడైభరతు। గనిపలికెనీవంటిఘనునెందుగాన।వనజాప్తకులసోమువరరఘురాము।వలనొప్పగొనివచ్చివచ్చినరాజ్య। మెలమినీగోరితివినకులతిలక। నీమహిమంబెన్న నేనేరనింక। రామభక్తుడవీవు।రాజకుమార। రాముండుసీతయురామానుజుండు। క్షేమంబుగావచ్చివచ్చిరనిచట। నిలిచినారొకరాత్రినిక్కంబుగాను।తలకకసన్నయుతమ్ముడిద్దరును। జడలుధరించిముచ్చటలాడుకొనుచు।కడుపడినావచేగంగనుదాటి। జనిరన్నవినిధరాస్థలిమూర్ఛబొంది। గొనకొనిలేచియాగుహునకిట్లనియె॥ శోకవరాళిరాగము-అటతాళము.

స్వామియచ్చటపవ్వళించెనూ। సీతా। భామయచ్చటశయనించెను

చెనూ॥ రాముడిచ్చటరా దేమిభుజించెనూ। సౌమిత్రిశియ్యాపతేమి
మిశేనూ॥ స్వా॥ నాతండ్రియచటగూచుండెను। యాసీతాతో
నేమిభాషించెనూ। ఖ్యాతిగా శ్రీరంగనేతపై వెలుగొందు। సీతేశ్వ
రుని పాదసేవకుండవునీవు॥ స్వామియచ్చట॥ వ॥ యిట్లుబలుకు
చున్న భరతుంగనుంగొని గుహుండు మహాత్మా శ్రీరఘువరుండిచ్చ
ట సీతాసమేతుండై గూర్చుండి సౌమిత్రి దెచ్చిన జలంబులు త్రా
వి హింగుదీవృక్షమూలంబున జానకి సమేతుండై శయనించెనంత
ట యేనును సౌమిత్రియు చాపంబుల ధరియించి జాగరూకులమై
యుండితిమని పలికిన రామశయ్యాప్రదేశంబు వీక్షించి నేలం బడి
మూర్ఛిల్లి మరలం దెలివొంది చిత్తంబున నిందీవర శ్యామ సుంద
రంబగు శ్రీరామచంద్ర దివ్యమంగళ స్వరూపంబు సీతాసమేతం
బుగా కన్నులం గట్టినట్లు దోచినదైన హారామ రామా యని విల
పించుచు దీర్ఘలోచనంబులం వెడలుబాష్పంబులు కరతలంబునం
దు తుడుచుకొనుచు నిట్లనియె॥

పున్నాగరాగము-అటతాళము.

అయ్యయ్యోయీ నేలనెటబవ్వళించెనో రాముడు। గుణధాము
డు। చయ్యనజనకరాజన్యపుత్రికెతోడ నెయ్యములర బవ్వళించినట్లె
పడె॥ లలితహేమహర్మ్యములబవ్వళించేటస్వామికి। వైదేహి
కి। వలిగాడ్పు వెలయునీ స్థలిబవ్వళింపగ। గలిగెనహాహానావలనసిక్ష
ష్టము॥ అయ్య॥ ఘనతరమంగళవాద్యధ్వనులు వినువానికి। శుకవాణికి।
వనమృగఘోరనిస్వనములువిననాయసను బ్రోచు రంగనాథునిదయ
లేదాయ॥ అ॥ అయ్యయ్యో॥ క॥ భరతుండీగతిబలుకుచు। ధరణిం
బడిదుఃఖమొందతగశత్రుఘ్నుం। డరుదుగనన్నుబట్టుక। బరువడి
దుఃఖించెనపుడుపటురవమెసగనూ॥ వ॥ అంతకౌసల్యా సుమి
త్రాదులు చనుదెంచి భరత శత్రుఘ్నులం గాంచి విలపింపదొడం
గి రాసమయంబున పతివ్యసనకర్శితయు నుపవాసకృశాంగియున
గు కౌసల్యాదేవి భరతుంగౌగిలించుకొని యనేక విధంబుల నాక్రం
దింపుచు తండ్రి దుఃఖింపవలవదేను రామవియోగ పతిమరణ దుః
ఖంబున దేహంబు విడువక నిన్నుం గాంచి యున్నదాన గావునసీవు
దుఃఖంబు మాని మమ్ము లదర నూరడించు భారంబు దెంది యు

న్నాదని పలికి యతని కన్నులంవెడలు బాష్పంబులువస్త్రంబునం దుడిచి యూరడించిన యనంతరంబ భరతుండు జటావల్కలంబు లుదాల్చి సైన్యంబులతోడ గుహుని సహాయంబునభాగీరథిందాటి భరద్వాజాశ్రమంబు ప్రవేశించి యమ్మునికినమస్కరించి తావచ్చి నవృత్తాంతంబెరుంగంజెప్పిన సమయంబునా॥ చ॥అనుపమభక్ష్యభోజ్యపరమాన్నఘృతాదులనింపు సొంపుగా।మునివరుడేపకారించి కలమూకలనెల్లనుతృప్తిజేసి।చయ్యనఘనగంధపుష్పవనితాది సుఖంబులొనపణ్జాయగా। మునిని నుతింపుచుం పరమ మోదము జెందిరిమానసంబులనూ॥ వ॥యివ్విధంబునం భరద్వాజుండు మహానియ్యవైభవంబు గావిందు గావించిన యనంతరంబ భరతుండమ్మునివరేణ్యునకుం బ్రణమిల్లి రాఘవేంద్రుండుచిత్రకూటంబునం వసియించియున్న వృత్తాంతంబును యా మార్గలక్షణంబులును మునివలనంజెలసి వీటొక్కని శత్రుఘ్నసమేతుండైతరలి చిత్రకూట సమీపమార్గంబునం బోవుచున్న సమయంబునా॥

సీ॥చిత్రకూటంబునసీతాసమేతుడై మునులమైత్రినిమహామోదమలర।వతిణంపుచునురఘువల్లభుడొప్పంగభరతుసైన్యధ్వానమరుదుగాగ।వినిపింపవినిరఘువీరుండుసౌమిత్రిగనియివ్వనంబున ఘనని నాద।మచ్చుగావినబడెనదిగను గొనుమన్న గ్రక్కునయొకవృక్షమెక్కివేగ। భరతుడేతెంచుటలుగాంచిపరమకోప। వివశుడైకన్నులెర్రగావెలయవచ్చి। బాణబాణాసనంబులుపరగదాల్చి। రాఘవేంద్రునకిట్లనెరయముతోడా॥

ఆనందభైరవి-ఆదితాళము.

అదుగో వచ్చెభరతుడొసైనా యన్నలెమ్మి। కైకకొడుకువీడునమ్మ వలదన్నదక్మి।దండెత్తివచ్చుచున్నాడుదపణమొప్పా। వీనిఖండింతుమగ్రశోకముకైకకొప్పా ॥౧॥ ఆత్మగోపణగావింపుమగ్రజన్నా।వోభద్రాత్మకకవచనమూదొడిగియలరుమన్నా॥౨॥ యింతసీతనొక్కగుహునుడంతమింక।వచ్చుదంటిఘోటకాదులజూడవగవే శంకా ॥౩॥ అదిగోకోవిదారధ్వజరథముపెంపూనీ।విదిగోచు... వయ్యాసైన్యమొదవుసొంపూ ॥ ౪ ॥ మానకశరచాపములుబూ వ యూన్యా।వీనిమానకద్రుంచినచింతవా ననయ్యా॥౫॥ వీనిద్రుంపనక

తేమ రాఘవేంద్ర రంగశ్రీనిలయవాసస్వర్ణమానవేంద్ర ॥౬॥ ఉ
డుగో ॥వ॥ యివ్విధంబునంబల్కినతమ్మునింజూచిరఘువరుండిట్ల
నియె॥ ఆనందభైరవి. ఆదితాళము.

శరచాపములుబూననేలా। నీమదిలో భరతు। చరితమేమెరిగితివి
చాల॥గురుతుగవనినునమరుదుగవెలయగ। వరమతిగానిపోవగభర
తుడురా॥శర॥గురుతరాటవులకేగుదెంచి। ఘనమువసియించు మెరి
గితల్లినికడుభజియించి।భూరిభూరిదుఃఖముబొందుచువెలుపడి।భరతు
డుమసలనుమరలుపగదియగ॥శరచా॥ అన్నాలక్ష్మణవినగదోయి।
భరతునివంటియన్నా పైకూర్మివారెరగోయి।నిన్నునన్నుసీతనుతన
కన్నుల।చెన్నలరగజూడగనరుదెంగ॥శరచాప॥౩॥ ఘనుడుభరతు
డు ప్రాణసముడు।యిటువంటిసోదరునిసీవిట్లాడనాయనిపుడు। ము
నినుతమగురంగనివాసుడనగు।ననుగోరిచెటిభరతునిగనిజపమున॥
౪॥శరచాపములుబూననేలా॥ వ॥ అనియిట్లన్నవచింపగావిని
యహో యన్యాయశీలుండనై।ఘనకారుణ్యమొకింతలేక భరతుం
కాఠిన్యతంఘోరశత్రునిగానెంచితినంచు। లక్ష్మణుడుతాదుర్వార
ఖేదంబునం। తనలోతానెయణంగిశిగ్గునను సీతా నాథుచింతించు
చునూ॥ వ॥అంత రాఘవుండు సౌమిత్రిని హితవాక్యంబుల ప
దిలపరచె నాసమయంబున భరతుండు సేనల వెనకరా బనిచి తా
నును తమ్ముండును పాదచారులై చిత్రకూటంబు చేరం జను దెం
చి రామాశ్రమంబువెదకుచు జనుదెంచుచు శత్రుఘ్నునికిట్లనియె॥

ఆనందభైరవిరాగము-అటతాళము.

తాపముబాయదుతమ్ముడా। హృదయతాపము॥ తాపస వేష
ముదాల్చినయాసీతాపతిదివ్యస్వరూపముగనికున్న ॥ రామునిజగ
దభిరామునిసీతాభిరామునిపట్టాభిరామునిజూడకగాని॥౧॥ అరవిం
దసుందరముఖయన్నపదములకొరగి మ్రొక్కి మ్రొక్కి కరుణబడ
యకున్న॥౨॥ శ్రీమదిందీవరశ్యామునిశ్రీరఘురామునినెమ్మోము
ప్రేమజూడకగాని॥౩॥జనకజగాంచిచక్కనిభక్తిమించిమజ్జననిరో
నన్నుపాలనసేయుమనకున్న॥౪॥ శత్రువిజయునిసౌమిత్రిని పరమ
పవిత్రునిగనిబహుమైత్రినెరపకున్న॥౫॥శ్రీరంగపతియనచెన్నుమీ
రినరఘువీరునిసన్నిధిచేరనిల్వకగాని॥౬॥ తాపముబాయదుతమ్ము

తా॥ వ॥ యివ్విధంబున బలుకుచు సీతావల్లభుఁడు దివ్య మంగళ స్వరూప సౌందర్యంబు కన్నుల నెప్పుడు జూతునో యనుతలంపుసం జనించుచు॥ ద్వి॥ విరివిగా నవ్వనవీధియందలరు। సురభిచంద నపటుసురుచిరవకుళ। వరలవంగరసాలవంజుళప్రముఖ। గురువృక్ష శాఖలకొమరారునట్టి। సమదకోకిలకీరషట్పదగణాది। విమలనాదం బులవిధమెల్ల వినుచు। చనిచని యొకపర్ణశాలలోపలను। మునివందితునిజగన్మోహనవేషు। నవనీరదశ్యాము నయవాక్యనిపుణు। భవవినాశను చారుపద్మపత్రాక్షు। సత్యసంధుని పుణ్యచారిత్రు ననఘు। సత్యవ్రతుని శరచ్చంద్రనిభాస్యు। శతకోటిమన్మథసౌందర్యకలితు నతిభక్తి భరతుఁడాయన్న నుగాంచె॥ క॥ వరమతి మరియును కన్నుల। భరతుండట గాంచె నధికభక్తియుతుండై। గురుదభాస్తరణంబున। విరివిగ గూర్చున్నయట్టి విమలచరిత్రున్॥ వ॥ యిట్లు గాంచి కన్నీరు నించుచు॥ క॥ హా కాకుత్స్థకులేశ్వర। నాకతమున బూననాయ గా ముని వేషం। బేకరణి తనువునిలుపుదు। నీకరుణాలోకనంబు నిగుడక యున్నన్॥ క॥ ఘనమణిసంపద విడిచియు। వనమున వసియింప నయ్యె వసుధాసుతతో। ననుజునితో నావలనను। వనమే పురమాయె నీకు వనజదళాక్షా॥ క॥ మునివేషము ధరియించిన। నినుగనియు న్నాఁడ నిలువనీరైనే ని। వ్వనము న చావక నే క్రియ। తనువు ధరించితిని యెంత దారుణ మతినో॥ వ॥ అని యిట్లు బలుకుచు హాహాకారం బునం బరుగిడి శత్రుఘ్నసమేతుండై శ్రీరాఘవేంద్రచరణారవిం దంబులందలేక ధరణింబడి వివశుండై యున్న సమయంబున శ్రీర ఘువరుండు కృశీభూతదేహుండును జటావల్కలధరుండును నగు భరతుంగాంచి విస్మయంబంది కౌగిలించుకొని యంక తలంబునం జేర్చి శిరంబు మూర్కొని మరియును శత్రుఘ్ను నవ్విధంబునం గా వించి తదనంతరంబున భరతుంజూచి రాజ్యరక్షణ వృత్తాంతంబు ను క్షేమప్రశ్నయు నడిగిన నన్నకిట్లనియె॥

శోకవరాళిరాగము-అటతాళము.

అన్నా నాకేమిటికీ రాజ్యసుఖములు। నిన్ను బాసిన వేళను। యన్నఁగ నుస వంశమునకనిష్టుడు భూమేలుటనును వింటివా। నీ వెరుగవె॥ యన్నా॥ యన్నెన్నో రాజ్యభారము గలవారల చిన్నలనడిగితివి। స

న్నతాంగ రాజ్యము సేయుకొంకేనే నెన్న దెరుంగనో యన్న సీపాద
మానఁ యన్నదు॥౧॥ విరివిగ జడలువల్కలములు గల నన్ను వరమతి
గనుగొనుచు। గురు రాజ్యవృత్తాంత మరయ బోలునె చాలధరణిసా
యతులు నా తెరుగునయుందు రె।౨। నే నేమి యెరుగ దుష్టాత్మ యోకై
కచే నిందేల బొందితిని। నా నేరములు గాంచి నన్ను రక్షింపుము। మాన
కనరుదెంచి మహి నేలు మ్రొక్కెద॥ నన్న ॥౩॥ పనిబడి నే రాకము
న్నె దశరథుడు పరగ నాకము కేగెనూ। ఘనరంగ నాథుని దలచుచు సం
స్కారమను రక్తి చేసితినను జుని గూడుక॥౪॥ అన్న నాకేమిటికి॥

వ॥ యివ్విధంబున దశరథుండు స్వర్గంబునకుం జనిన వృత్తాం
తంబు విని దురంత దుఃఖావేశంబున సీతాలక్ష్మణ సమేతంబుగా ధర
ణింబడి మూర్ఛిల్లె కొంత సేపటికిం దెలసి కన్నీరొలుక యనేక వి
ధంబుల విలపించుచు జానకీ నీమామ దివంబునకుం జనియె। సౌమిత్రి నీ
వు జనకుండు లేని వాడవై తి వేయని పల్కి మరియును నేను బాల్యం
బున నాటలు మరిగియున్న నా మేని మన్నుదుడచి రక్షించిన వాడవెం
దు బోతివని దుఃఖింపుచున్న యెడ భరతాదులూరార్చిరి తదనం
తరంబ సీతాలక్ష్మణ ప్రముఖ సమేతుండై చని మందాకినీ శుభజలం
బులం గృతస్నాతుండై దశరథునకు బదరి మిశ్రిత హింగుది పిణ్యా
కంబునం క్రియలొనర్చి కృతకృత్యుండై యాశ్రమంబునకుం చను
దెంచిన సమయంబునా॥ సీ॥ దశరథ స్త్రీల నందరి వెంట బెట్టుక
యావసిష్ఠుడు వేగ నరుగుదేర। మందాకినీ తీరమందు తండ్రికి రామ
చంద్రుండు చేసిన సత్క్రియలును। మెండైన యాగార పిండి ముద్దయు
జూచి కౌసల్య యధిక దుఃఖమున మూర్ఛ। జెందె సుమిత్ర తోపొందుగా
నిట్లనియే మమ్మ సకలోర్వి నేలు నట్టి। తండ్రికిచ్చుట రఘుపతి తగ యొన
ర్చె। నట్టి సత్క్రియలివె చూడ వమ్మ జగతి। భూరి విభవంబు గల్గి
న భూపతి కెని। గార పిండి భుజింపగ గల్గెనకటా॥ వ॥ యిట్లు దుఃఖిం
పుచు కౌసల్యాదులు పర్ణశాలకుం జనిన సమయంబున శ్రీరామ
చంద్రుండు సీతాలక్ష్మణ సమేతుండై వసిష్ఠునకుం దల్లులకు వందనం
బులు గావించి కౌసల్య యధిక దుఃఖావేశంబున కొమరులం గౌగలి
సిం గౌగిలించుకొని కన్నీరొలుక రోదనంబు సేయ వారు సుఖితులై

నేమోక్షంబున విలపించుచుండిరంత సైన్య జనంబులును పురజనమ్ము-లును రఘువరుంగని శోకించిరా సమయంబున వసిష్ఠాదులు రామలక్ష్మణసీతాభరతశత్రుఘ్న కౌసల్యాదుల నూరడించి రయ్యవసరంబున భరతుండంజలిబద్ధుండై యన్నకిట్లనియె॥

సౌరాష్ట్రరాగము-ఆదితాళము.

అన్నా రమ్మికపోదమయోధ్యకు।యడవినుండనీ కేలా ॥ యీయడవినుండనీ కేలా॥ చిన్నితమ్ముడానీవీలాగునచెప్పందగునాతండ్రి ॥ యిటుచెప్పను॥అన్నానాహృదయమురంజిల్లగ।సవనిబ్రోవుమికసన్నా।నీవవనిబ్రోవుమికనన్నా।పన్నగమసకీధర్మవిరోధము।జన్నవసుమతిలోనా॥యిదిజన్న॥యెన్నగమనకులమునకనిష్టుడిలనేలందగునాయన్నా।యిలయేలందగునాయన్నా।కన్నతండ్రిపనిసేయుటమనకక్కరగాదానాతండ్రి॥మనకక్కరగాదానాతండ్రి॥అ॥ వనమునేవసించెదనీవికజనుముపురంబునకన్నా॥యికజనుముపురంబునకన్నా ॥ ఘనరంగేశుడనగునేనెయివ్వనముననిశ్చేదనింకాయివ్వనముననిశ్చేదతండ్రి ॥ గీ ॥ అన్నయీక్రియతాసేయువిన్నపంబు।విశ్వసింపకబలికెడివిధమునదికి।తాపముదయింపసేయగంతఁబ్రడగుచు।బాష్పపూరితనేత్రుడై బల్కెమరలా॥

నీలాంబరిరాగము - ఆదితాళము.

వేంచేయవయ్యనీవయోధ్యకు।రామవేంచే॥పంతగించిదీనులనలయించన్యాయముగాదు॥వేంచేయవ।అన్నానీవాడనురక్షించుమీ।తప్పుబున్నాతండ్రివిననుశిక్షింపుమీ ॥వో॥ యన్నారామనవివినకుంనాజీవింపనేర॥వేంచేయ॥నినుబాసినిమిషమోర్వజాలను।నేనువెనువెంటదగిలివెలయువాడనూ॥వో॥ ఘనరంగనిలయనీకీకార్యమేలవచ్చె॥వేంచే॥ వ॥యిట్లువిన్నపం బొనరించిన రఘువల్లభుండు సాదరంబునప్రతికూలవాక్యంబులు బలికినభరతుండుకన్నీరొల్కవిలపించుచు॥

శుద్ధకాంభోదిరాగము-అటతాళము.

యెన్నిజెప్పినమాయన్నాకుదయరాదున్నదేమో । వోయన్నలక్ష్మణ।నీవువిన్నపమొనరింపతిన్నగానూ॥కరుణజూడుమునన్నుకలుషహరుంగనికర్జముగాను । యీపరమపావనుడగుయన్ననుబోధిం

భృభక్తితోను ॥౧॥ అమ్మ సీతమ్మ యేమమ్మ చెప్పవమ్మా యన్నతోను।
వోయమ్మ యివ్వనము గృహమ్మా యగదవమ్మ నెమ్మితోను ॥౨॥ అమ్మ
నీవు మృదుచరణమ్ముల యీ యడవిలోన మరగాంచి। వోయమ్మ క్రక్కున
గూలకున్నవాడను యేమన్న మించి ॥౩॥ వచ్చినవారెల్ల యూరకే చూ
చెదరచ్చగాను। మీరు క్రచ్చరరంగేశుడగు రాము వేడుడి హెచ్చ
గాను ॥౪॥ వ॥ ఇవ్విధంబున నంబలికి రాఘవేంద్రుం గనుంగొని
నీ వయోధ్యకు రాకున్న ప్రాయోపవేశంబు చేతునని పల్కి తత్ప్రి
యత్నంబు సేయుచున్న తమ్ముని గౌగిలించుకొని మనమున క్షత్రియ
ధర్మంబు దప్ప పాడిగాదు గావున వనవాస నిర్ణయసమయంబుగ
డపి యొకదినంబైన నిమించకుండ నయోధ్యకు జనుదెంతునని యూరగ
డించి తదనంతరంబున యతండు వలసి యడిగిన పాదుకలొసంగి
న యాభరతుం డతి భక్తింగైకొని శిరంబున దాల్చి యన్న మొగం
బు చూచి దేవా నీవు వచ్చుపర్యంతం బేను పట్టణంబు చొరక దేవర వా
రి పాదుకలయందు రాజ్యభారంబిడి భక్తిం బూజింపుచు నందిగ్రా
మంబున నివాసంబు చేసి నియమంబున నుండువాడ నీవానతిచ్చిన కా
లంబున కయోధ్యం జేరకుండితి వేని నిక్కంబుగా నగ్ని ప్రవేశంబు సే
యుదునని పల్కి శత్రుఘ్నసమేతుండై సీతారాఘవులకు ప్రదక్షిణ
నమస్కారంబులు గావించి లక్ష్మణుం గౌగిలించుకొని గమనోన్ము
ఖుండయ్యె నట్టియెడ శత్రుఘ్నుండు మ్రొక్కిన లక్ష్మణుండు తమ్ము
నిం గౌగిలించుకొని దీవనలొసంగె రఘువరుండును సీతా లక్ష్మణు
లం గూడి వసిష్ఠునకుం దల్లులకు నమస్కరించి వారివలన దీవనలం
బొందె నంత భరతుండు తల్లులం దోడ్కొని సైన్య సమేతుండై పు
రంబునకుం బోయి యల్లవారల సదనంబులకుం బనిచి తాను నందిగ్రా
మంబున నిలచి నియమంబున రాఘవేంద్రుని పాదుకలు పూజింపు
చు కాలంబు బుచ్చుచుండె ॥ సీ॥ శ్రీరాముడంతట చిత్రకూటము
బాసి జనకజాలక్ష్మణ సహితుడగుచు। చని యత్రియాశ్రమంబున కే
గి సద్భక్తి మ్రొక్కిన తత్కృతి జెందె నక్కజముగ। పెనిమిటి యనుమ
తంబున సీత యమ్మానిసతియైన యనసూయ నతి తపస్వి। నయ్యెడ చని
కాంచి చయ్యన తన పేరు జెప్పి మ్రొక్కిన హర్షము ప్పతిల్ల। కౌగిలిం

కుండెప్పినట్లు సూతుండెరుంగించిన శౌనకాది మునీంద్రులు రామ
ధ్యానపరులై యుండిరంతా ॥మాలిని॥ నిరుపమసుచరిత్రా నీలజీ
మూతగాత్రా గురుతర భవశోషా। కోటికందర్పవేషా పరమప
దవిహారా పాపదైత్యప్రహారా। సురనుతపదపద్మా సూరి హృత్ప
ద్మసద్మా॥గద్య॥ ఇది శ్రీమదుభయకావేరీమధ్యప్రదేశ। ప్రదీప్తస
ప్తప్రాకారమహామందిరాంతర్విరాజమాన। శ్రీరంగనాథచరణ
సేవక। వరగంటి శేషగిరిదాసప్రణీతంబగు శ్రీమద్రామకథాసం
గ్రహాయత్తగానవిలాసంబునందయోధ్యాకాండ సర్వంబునేకాశ్వా
సము॥

సంపూర్ణము.



# అరణ్యకాండము



క॥ శ్రీకరసద్గుణాకర నాకేశ ప్రముఖవినుత నారాయణలక్ష్మీ
కామినీనివాస హృత్సాకేత కమనీయరంగభవనవిహారా॥వ॥ నైమిశార
ణ్యపుణ్యక్షేత్రనివాసులగు శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుండి
ట్లనియె నివ్విధంబున సత్రిమహాముని యాశ్రమంబువదలి రామల
క్ష్మణులు సీతాసహితులై మెల్లన సంచరించుచు నరణ్యమార్గం
బున బోవుచు॥ మధ్యమావతిరాగము. ఆదితాళము.

దండకాటవిజొచ్చిరప్పుడు రామలక్ష్మణులు ॥దం॥ మండితశరభ
వ్యాఘ్రమృగేశ్వర। గండకఘురుపేదండపలితమౌ॥దం॥ సరళపున్నా
గబదరీవకుళ। వటకుటజనింబకరవీరాశ్వద్ధపరవంజుళ। కురువకము
ఖబహుతరుశాఖాదులతరణికిరణములనెరిచొరనివ్వని॥దం॥౧॥ వ
నమృగములనిస్వనములు। ఝల్లిజనేడిఘనసనర్జ తతులనిగనిగ
లూ। ముసుకొనివినిపించెడి రాక్షసగణమొనరించెడి భజన లాదిగ

గల॥దం॥ ౨॥జనకపుత్రికిభయముదొలఁగ। ఘోరవ్యాఘ్రములెనసికడు
భీతినిబారఁగ। మునిసన్నుతులకురంగపురీశులుపనివడిచాపధ్వనులమ
రింపుచు॥ ౩॥దండకాటవిఁజొచ్చిరపుడు॥క॥ ఈరీతిదండకాటవి। తో
రంబుగఁజొచ్చిచనఁగఁదొలఁగకనుగ్రాకారముతోడవిరాధుఁడు। చేరి
వడిందాయవచ్చిసీతాకాంతను॥గీ॥ క్రోధమలరనెత్తుకొనిచంకఁబె
ట్టుక। రాముఁజేరవచ్చిరాజపుత్ర। మిమ్ములీలఁద్రుంచిమీమాంసములు
మెక్కి। గర్గైనాకటంచుఁగదియువేళ॥సీ॥ ఆరాజనందనులత్యుగ్రులై
ఘోరసాయకావళులేయఁబరఁకుఁగొనక। జానకినటుడించిమానకచ
నుడెంచిరాఘవలక్ష్మణులనురయముతోడ। పటుపరాక్రమమునఁబట్టి
మూపులమీఁదఁబెట్టుకకొనిపోవఁబెట్టిచూచి। జనకజశోకంపఁగనివాని
భుజములువడిదెగనేయంగభూతమిగూల। వారివెరగెల్లవారిచేకొ
రిఁజెలసి। యేనుతుంబురుఁడనువాఁడనిలనఘనుఁడ। శాపవశమునఁనిల్చితి
జనవరేణ్య। లోకనాథపాదములఁజొచ్చిగారవమున॥౬॥ ననుఁబ్రోచితిమీ
రుశరభంగసంయమీంద్రునమునికడకేఁగుఁడు। గొనకొనిమిమ్మునివ
రుడుగారవించును ఘనభక్తినటంచుఁజక్కఁగరుగు రుదారుఁడౌ॥ద్వి॥తన
తొంటిరూపంబుతగఁదాల్చిచనిన। వెనకనారాఘవుల్ వెనవానితను
వు। ధరణిలోస్థాపించితగఁబోయిపోయి। శరభంగమునిశుభాశ్రమ
మంతఁజేరి। మునికినందనములుమున్నుచెప్పఁదోయ। కనుకనఁగాఁబూజించి
యగ్నిలోఁజొచ్చి। చనియెనమ్మునిబ్రహ్మసదనంబునకును। వినుతించ
రిత్రులైవిమలభోగమున॥౬॥ అంతటతాపసగణములు సంతసమున
వచ్చిరామచంద్రునిగనసంభ్రమభయభక్తితో దంత కాంతాలక్ష్మ
ణులఁగూడికడువడఁద్రెక్కెఁ॥క॥ ఇట్లుద్రెక్కిసనీవనలొసంగి దీ
నముఖులై మునులిట్లనిరి॥

శరణు శ్రీరఘుకులశరధిసుధాకర రామరామా॥ మమ్ము సరమర
సేయకకరుణఁబ్రోవుము శ్రీరామరామా॥ మేమివ్వనంబునఁదపము
లొనరఁగ రామరామా॥ మమ్ము। బాముల బెదరుదురుపుష్టరాక్షసు
లెల్లరామరామా॥౧॥ అనయమువ్వనమునసురులుచెలరేఁగి రామ
రామా॥ దోర్దములఁబధింపఁచుమొనసిచరింతురు రామరామా॥౨॥

దిక్కుఁగల్గినవారమైతిమి నేటికి రామ రామా ॥ మమ్ము గ్రక్కున బ్రో
వుము రంగవల్లభ శ్రీ రామ రామా ॥ ౩ ॥ గీ॥ ఇట్లు దీనులగుచు నెలమి
భాషించెడి । మౌనివరుల జూచి మానసమున । చాలదుఃఖమొంది సద
మల కరుణచే నభయమొసగి బల్కెఁ నార్తిఁ బాయ ॥

పంతువరాళిరాగము-ఆదితాళము.

చంపెద నిజముఁగ నింకా । రాక్షసకోట్ల మునులారా జనుఁడు నిశ్శంకా
చం॥ మిగుల సౌఖ్యము మీకిచ్చుటను గల్గ । తగ జేయకున్న నాతను వేల
ధరను ॥ ౧॥ ప్రతినబట్టితి దైత్యహననా । దైత్యవితతి జచ్చినయట్లు
వినవో దరికను ॥చం॥ ౨॥ రంగధాముఁడనైతి నేని । మీకు మంగళమొన
రింతు మఖిలోకనఁబూని ॥చం॥ ౩॥ వ॥ ఇవ్విధంబున ప్రతినఁబూని ముని
గణంబుల వలన యనుజ్ఞఁ గొని సీతాలక్ష్మణ సహితుండై కదలి రమ్య
భూరుహవితాన మండితంబగు సుతీక్ష్ణాశ్రమంబునకుం జని బ
హుకాలంబచ్చట వసియించి మునిగణంబులకు రాక్షసబాధ లేకుం
డం జేతునని తానొనర్చిన ప్రతినవృత్తాంతం బెఱింగించిన నమ్ము
ని సంతోషచిత్తుండయ్యె నంతట నేకాంతంబున సీతా కాంత నిజ
కాంతునింగనుంగొని యిట్లనియె ॥

మధ్యమావతిరాగము - అటతాళము.

వలదు వసివైరములు మీకు వలదు వల్లభా ॥ వలదు వసివైరములు వెను
కవలదు వలదీ ఘోరాటవులు । బలమదోపేత ఘోరరాక్షసులు నటించు
నెళవు విందు ॥వలదు॥ వచ్చిన కార్యము గడపి వచ్చినమున్న వనయోధ్య ।
కచ్చగబోకమనకు మెచ్చవంతము లేదికి ॥వల॥ ౧॥ చలము సేయన
ట్టి దానవుల వధింతునను చపలతనదో । బలము వలన బలుక నేలన విన
నేత్ర మొక్కగా ॥వల॥ ౨॥ మునుల చందమున మన సమువనముల
నుండగవచ్చి । జనునెపహింసలోనవశించుట రంగనాథనాథ ॥వలదు
వసివైరములు ॥ ౩॥ ద్వి॥ అని యిట్లు బలుకంగ సతి వెనుజూచి । ఘనమ
ధురోక్తుల కాంతుఁడిట్లనియె । వినవె చక్కని రాణి వినవె పూబోణి । వి
నుతికెక్కిన మునుల్ వెసడాసి మనల । దారుణ దైత్యబాధలకోర్వలేక
నారూఢిమము బ్రోవుమని శరణన్న । మనము పాలింపక మానుట తగు
నే । మునుల బ్రోచుటతోఁటి మొనసిన మంబు వనజాక్షి కద్దటె వసుమ

తిలోన|దనుజసంఘములు మద్దారుణబాణ| తతిదాకిచావకధరనుం
డగలరె|మతిలోననికభీతిమానుమటంచు|బలికిసుతీక్ష్ణ పరమసన్మ
నికి|వలనొప్పనంత కేవలభక్తిమ్రొక్కి॥ గీ॥ అమ్మునీంద్రునివీట్కొని
సమ్మతమున| పావనుండగుకుంభసంభవమహర్షి| సోదరునియాశ్ర
మము జేరి మోదమలర|వినయమున మ్రొక్కి మానిచే వినుతివడ
సి॥                    పంతువరాళిరాగము-ఆదితాళము.

వేంచేశెనంతమీదా| శ్రీరామమూర్తి| వేంచేశెనం॥వేంచేశెసీ
తతోడవిమలభక్తినితమ్ము|డంచితాసక్తిగొల్వనగస్త్య మునివరశు
భాశ్రమమునకు॥ వెంచె॥ భూరిమోదముతో డా|మునులెల్లవచ్చిచే
రిమమతజూడా|క్రూరరాక్షసులకెల్ల గుండెలు ఝల్లుమనసారసనే
త్రములసదమలము నియాశ్రమములు జూచుచు॥ వేంచేశెనం ॥ శృం
గారరూపముప్పొ|వైదేహిసొంపొసంగనుచ్చటలు జెప్పొ|అంగ
జకోటిమోహనాంగము వెలయదివ్య రంగనాయకుడై నరఘుకుల
దుగ్ధసముద్రశశాంకుడు॥ వేంచేశె ॥ వ॥ ఇవ్విధంబున నగస్త్యాశ్ర
మంబు ప్రవేశించి యప్పుణ్య పంచనంబులు గావించినయ్యగస్త్య
మునీంద్రుండు రామలక్ష్మణులం గౌగిలించుకొని మూర్ధిఘ్రా
ణంబుచేసి జానకిందీవించి పరమానందంబున రాఘవేంద్రు నియ
నేకవిధంబుల ననుగ్రహించి ఇంద్రదత్తంబగు బాణ బాణాసన ఖ
డ్గతూణీరంబు లొసంగి నంగైకొని యక్కుంభసంభవమునీంద్రు
ని యనుజ్ఞ గొని వెడలి చని నానావృక్ష మండలతా గృహ వితాన
మండితం బగు మహారణ్య మార్గంబు నం జనిచని గోదావరీ తీర
ప్రాంతంబునం జెన్నుమీరు పంచ వటీస్థలంబునం జేరిన యనంత
రంబునా॥            యదుకులకాంబోదిరాగము-ఆదితాళము.

పర్ణశాలగట్టెనప్పుడు వర్ణనీయముగా|నిర్ణయింపనలవిగా
నినిశ్చలరామభక్తిని|వర్ణితగుణుడౌసౌమిత్రి వలసిమంచి కొమ్మలు
దెచ్చి॥ పర్ణ॥ రాముడాహారముభుజియింపభామసీతరామునిగూ
డి|ప్రేమతో బవళింపనభిరామ స్తంభము లేపరించి॥ ప॥౧॥ మలయ
మారుతముచను దెంచు| మార్గమమరించిపుష్ప|లలితపల్లవతోర
ణములుగట్టివాస్తువిధిని॥ పర్ణ॥ ౨॥ రంగనాథుడై నరఘు|పుంగవుడా

ల్ల నెరింగించిన ఖరుండుగ్రాకారుండై పదునలువుర రధికవరులం
బనిచిన వారు యుద్ధసన్నద్ధులై చుప్పనాతి వెంటం జనిచని రామ
చంద్రునితోడ కయ్యంబొనర్చి నిమిషమాత్రంబునం దెగటారి
రంత శూర్పణఖ మఱలంజని ఖరునకెరిగించి రోదనంబు సేయు
చు నిష్ఠురోక్తులాడిన యనంతరంబ ఖరుండు దూషణత్రిశిర ప్ర
ముఖ చతుర్దశ సహస్రరాక్షస సమేతుండై దండు వెడలి పర్ణ
శాలకడకు వచ్చు సమయంబున రామచంద్రుండు సీతాలక్ష్మణుల
నొక్క గిరిగుహకుం బోవంబనిచి రౌద్రాకారంబునం ధనుర్ధ
రుండై నిలువంబడియున్న సమయంబునా॥ క॥ సురగరుడసిద్ధవిద్యా
ధర గంధర్వులును సకలతాపసగణముల్। వరరఘువీరుని విజయము
నెరిగోరుచు చూచువేట్కనేతెంచి రోలిగ ॥౬॥ ఆసమయంబునా॥

ఆనందభైరవిరాగము-ఆదితాళము.

సుమహితకరిరథఘోటకములతోడా। సైన్యసమితిగ్రమ్మివచ్చె
పర్ణశాలజాడా॥ భీకరాంగులగుచు రాముడాకీరంతా। డాకినీక
తోనాయకములతైనివిసరనరంతా ॥౧॥ సింహనాదములు ఘోరై చేసి
రంతా। రాజసింహులపై బాణవర్షములిమ్మెరంతా ॥౨॥ ఆరాఘ
వేంద్రుడు రౌద్రాకారమునను। నానమూరాధికంపిడి చేసెనసు
రులడలనూ ॥౩॥ పరగ ప్రత్యాగ్ధదివ్యచరణములు పృథూ। తీవ్రశర
ములసైన్యముల ద్రుంచెనసుమసాగనూ ॥౪॥ అతులవిక్రమమునదూ
షణాదివీరులా। రంగపతిలీల ద్రుంచెను దివ్యబాణవితతులా ॥౫॥

క॥ ఖరుడుగ్రతగుచు రాఘవు। బోరిగొండు సటుండ డాకిపోలుప
గుయుద్ధం। బరుదుగజేసి యురఘుపతి। శరముల భూస్థలినిగూలెచ
య్యానంతనూ ॥౬॥ సురదుందుభులు మ్రోసెసుమవృష్టిగురిసె। సు
రకాంతలాడిరి సుందరంబుగను। మునులెల్ల విచ్చేసి ముదము రెట్టింప।
వినుతించిరా రఘువీరుని చర్య। లంతటలక్ష్మణుండవనిజతోడ। సంత
సంబున పర్ణశాలకువచ్చె। మునిగణంబులకెల్ల ముదమాయెననుచు।
మనమున సంతోషమగ్నుడై తలిర్చె। జనకజాపతి పర్ణశాలకే తేర।
గనిదిగ్గనసులేచి కమలాక్షి సీత॥

సురటరాగము- ఆదితాళము.

నాథుని కౌఁగిలించనూ। సీతావధూటి॥ నా॥ సాధు మానసుల కెల్లబాధలు దొలఁగ రిపుల సాధించి గెలిచెనని సరససంతోషమున॥ నా॥ తళుకు చెక్కుల మీఁదనూ। ధళధళను కెంపులలరు కమ్మలు మెరయనూ। చెలువమైన బంగరు పచ్చలకీల్కంకణములు వెలయు హస్తాబ్జములు వేడ్కతో దుత సాచి॥౧॥ నా॥ గొప్ప కన్నుల నిండనూ। హర్షబాష్పములుప్పతిల్లుచునుండనూ। తప్పక రాత్రుసవితతుల గెల్వఁగఁ బోయి। నప్పటినుంచి కన్నులఁ గప్పినట్లున్నావని॥ నాథుని॥౨॥ సరిలేని కళలతోడనూ। నసుమసియాడ। బిరబిరఁ బోయి ప్రేమనూ। వరరంగధాముఁడైన వల్లభుఁడా సిద్దైత్య వరుల పెక్కండ్ర నెట్లు బొరిగొంటి వంచు మరిమరి॥ నాథుని కౌఁగిలించనూ॥౩॥ గీ॥ కామినీమణియగు సీత కౌఁగిలించ। సంతసము జెందె శ్రీరామచంద్రుఁడపుడు। పర్ణశాలకు వేంచేసి పణతిఁ గూడి। సోదరుని తోడ నొప్పారె మోదమలర॥౪॥ అంతట ఖరసైన్యంబులో హతశేషుండగు యకంపనుండను దానవేంద్రుండగు రావణు కడకుం జని కేలు మోగిచి యిట్లనియె॥

ముఖారి రాగము- అటతాళము.

వినవోయి రావణ వినవోయి నేఁడూ। మనకు వాటిల్లెను మహిలోన కీడూ॥ దనుజేంద్ర దశరథ జనపతి సుతుఁడూ। వినుతోగ్ర బలుఁడస్త్రవిదుఁడు రాఘవుఁడూ॥౧॥ నలలితేన్మరకత శ్యామసుందరుఁడూ। జలరుహపత్ర విశాలలోచనుఁడూ॥౨॥ వనజాంకియగు దేవి తోడ వాఁడూ। మునిపక్త్రీసనురక్తి వనిఁ జేరినాఁడు॥౩॥ నయమున మునుల మన్ననఁ జేసినాఁడు। భయభక్తి చెలఁగ నభయమిచ్చినాఁడు॥౪॥ ఘనదీప్తి పంచవటిని జేరి చాలా। మొనసి వచ్చె నయా శూర్పణఖ సుశీల॥౫॥ క్రక్కున గోసెను సెకనా నాసములూ। మొక్కడ లేదెన్ని కేదాని పలలూ॥౬॥ కరమొప్పఖర దూషణాదిగా మనవారి। బొరిగొనె నసపస చెచ్చెర గండుమీరి॥౭॥ ఆచందమాయందమా విక్రమంబూ। నీ చందమని చెప్పనిక దుర్లభంబూ॥౮॥ అతని సహోదరుఁడటువంటివాఁడు। సతి కెవ్వారలు గారుచ చెఱంపఁబోడు॥౯॥ యెదిరించి బోర రాజెవ్వారలకునూ సదుపాయమిక నుఘంచ నజాయసగునూ॥౧౦॥ సతిని హరించి తెచ్చితివేని

ధరనూ।మృతులగుదురుశోకహతులై క్రచ్చరనూ॥౧౧॥వరరంగనిల యులనరమరమాని।కరమొప్పవంచనగావింపవలని॥ వినవోయిరా వణవినవోయినీవు॥౧౨॥ద్వి॥అనియిట్లుబలుకంగనామాటలెల్ల।విని రావణుడురౌద్ర వివశుడై వేగ।మారీచుకడకేగిమన్ననగనిరి। యా రాఘవునిచరిత్రాతిశయంబు। వారకవివరించివంచనతోడ।నారా ముదేవినిహరియింతుమన్న।మారీచుడంతటమహితవాక్యముల। నా రావణునితోడనతిచోద్యముగను। రామచంద్రునిపరాక్రమమెల్ల జెప్పి।వేమారుబోధించివెసబంపెనంత॥క॥తనముక్కుచెవులుదశర థ।తనయుడుగోయించువార్తదశకంఠునకుం।వినిపింపగజనిరావ ణు।గనియాశూర్పణఖరాముకథజెప్పెగదా॥వ॥ఇట్లుబలికి॥

క ॥ బలవంతుడననిజగములు। గెలిచితిననిధాత్రి సమరకేళినినా తో।చలమెత్తిగెలువలేరని।బలికెదవేవేళనీవుబలమిలనణగదా॥

గీ॥దాశరథులునన్నుతగవిరూపినిచేయ।యూరకున్నవాడవేరఖ లుడ।చలముతోడదివ్యసాయకావళులేసిచంపు మింకవారి తెంపుగ లిగి॥వ॥అన్నానీవధిక విక్రమంబున పంచవటీస్థలంబున నిలిచి యు న్న రామలక్ష్మణులనతియత్నంబున సంహరించితి వేని జగన్మోహ నాంగియుశ్రీ రామపత్నియు నగు సీత నీకు భార్య గాసిద్ధించునాసీ తాసౌందర్యంబునాకుందోచినయంతమాత్రంబునీకు వివ రింతువి నుము॥

ముఖారిరాగము- అటతాళము.

కోమ్మచక్కనిముద్దుగుమ్మరా।మదినమ్మబంగరుతిగిబొమ్మరా। చెలువొందుచికురులలాగు।ఆచెలియమ్ముంజేతులబాగూ॥౧॥ కరి కుంభములసొంపుమీరు।ఆగరితకుచంబులతీరూ॥౨॥ సలలితఘననీల వేణి।చారుసైకతతుల్యసుశ్రోణి॥౩॥దాడిమబీజకాంతములూ। నవ్య తరమగుతరుణదంతములు॥౪॥కసక్రంపుటరటులపెంపూ। చూచిక లికిపెందొడలుహసింపూ॥౫॥ వదనముగెలుచుపవేందూ।నెన్న మనుజయింపమనథేందూ॥౬॥ పక్వబింబఫలంబూ ఆతరుణిక మ్మోవివిధంబూ॥౭॥చెలిగొప్పకన్నులసౌరు । మంచి తెలిదమ్మిరేకు లగేరూ ॥౮॥ వలనొప్పతళుకునద్దములూ।ఆయలనాగచెక్కుటద్ద ములూ ॥ ౯ ॥ కలదులేదనసందియంబూ।ఆకలకంఠికలరుమధ్యం

యుడుర్వి । నతికాయుడంద్రు వీడతుల పరాక్రముండార్యసేనా
సక్తుడస్త్రవిదుడు । పరమేష్ఠికరుణచేశరశరాసనఖడ్గకవచతూ
ణీరముల్ గలిగిచాల । వెలయుచుండునువీనివిక్రమంబునజేసిలంక
యొప్పునునిరాతంకమగుచు । కదనమునకువీడుకదలివచ్చినసురా
సురులుతల్లడించిపెరచుచుండు।రట్లుగానవీనినధికయత్నంబున।సం
హరింపవలయుజానకీశ ॥ గీ ॥ ఇట్లుబలుకుచుండ నెలమితోనతి
కాయు। డద్రిచరులనెల్ల నంపకముల। స్రుక్క జేసిలోకసుందరుం
డగు। రామచంద్రు జేరిపలికెసంతసమున॥

కాంభోధిరాగము.-అటతాళము.-

శరచాపములుధరించి। వచ్చితి। సమరముసేయదలంచి । వెరు
వకనిచటికిబిరబిరనరుదెమ్మరమరవలదికనని యొనరింతుము ॥ మా
నుకొనియెటుబోగలవు। నన్నునిమోహనమగునీతనువు । సునిశిత
బాణములనువుగబోనిపియు । నినునెత్తురువెల్లి సిముణిగింపగ ॥ శ
ర॥ ఖరుపైబరపినశరము। లియ్యెడగురుజవములరబరువుము। వర
రంగస్థలవాసుడవగునిను । దురముననేనత్యుగ్రతగెలువగ ॥ శర
చాపములుధరించి ॥ ద్వి ॥ యనవినిలక్ష్మణుడత్యుగ్రుడగుచు। తన
యన్నకడ్డమైదనుజునిజూచి। కోదండటంకృతిగానకోనిసేయు।నా
దైత్యుడదివినిహాస్యమొంది। పిన్నవాడవునీవుపెక్కుకయ్యంబు।
లెన్నడోనచిరనీవెరుగ వింతుకయు । విలునమ్ములీలబెట్టివిరిగిపొ
మ్మికను। నిలిచిననినుద్రుంతునిశితబాణముల । నవియన్నవినిపిల్లున
మ్ములుబట్టి । చనుదెంచియుండంగసమరంబుసేయ । కేలప్రేలె
దవింకనిల గూల్తునిన్ను । బాలుండనుచునన్నుభావింపవలదు। బా
లవృత్యవటంచుచరింతువున్న। కాలానలాభమౌ కాండంబు
లింట । చయ్యనసంధించిసౌమిత్రినేయ । నయ్యెడనదిద్రుంచెసా
రాముతమ్ము । డంతటనతికాయుడాగ్రహమలర । వంతంబుతో
నైదుబాణంబులేయ। దునిమిఫాలంబునదోర్వీర్యమమర । ఘనశ
రంబేయంగకడునెత్తురమరె ॥ గీ ॥ అంతదివ్యాస్త్రయుద్ధమయ్యె
సురరాజ। తనయుతోడనుగావించిదావమలతు। వాడితూపులుబ
రగింపబాణాయురము। బాణమునెల్ల దునిసివ్యర్థంబులయ్యె॥

వ ॥ వెండియు లక్ష్మణుండనేకబాణంబులేసి వాని కంఠంబు ఛేదింపంజాలక విస్మయంబొందుచున్న యెడ వాయుదేవుండరు దెంచి బ్రహ్మాస్త్రంబునంగాని వీడన్యబాణంబులం జావండని వ లికి యంతర్హితుండైనయనంతరంబున సౌమిత్రి సమంత్రకంబుగా బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన నయ్యతికాయుని కుండలాలంకృతంబగు శిరంబుధరం బడియె నట్టియెడ కపిగణంబులును దేవ గంధర్వ విద్యాధరమహర్షి సంఘంబులును రామానుజుని గొనియాడిరంత ॥ క ॥ హతశేషులయినరాక్షసు । లతిరయమునలంకకరిగి యసురేంద్రునితో । నతికాయాదుల తెరగంచితమతి బలుకంగ తప్తచిత్తంబమరగ ॥ వ ॥ దురంతచింతాక్రాంతుండై దాశరథులవిక్రమంబున కచ్చెరువొందుచున్న యెడనింద్రజిత్తుండు తండ్రికిట్లనియె ॥

కేసుప్తిరాగము- అటతాళము-

యేలాచింతించేవు తండ్రి । యేగల్గి యుండ ॥ కాలాగ్ని తుల్య బాణముల । కపికోట్ల రామలక్ష్మణుల । నేలగూల్చి జయముగొందు లీలధరనమ్ము మికను ॥ ౧ ॥ రంగవాసులైన రఘు । పుంగవుల గెలిచి చాల । మంగళవాద్యముల చే । నుప్పొంగుచు వచ్చి మ్రొక్కెద ॥ ౨ ॥

సీ ॥ తనతండ్రితోనిట్లు తగబల్కి యీట్టొకసివలనొప్పచతురంగబలము గొలువ । నతుల హోమమున బ్రహ్మాస్త్రంబు గొని దివ్యమరదముద్ధతినెక్కి సురలు బెదర । పొడగానరాకుండ బోయి మింటవసించె కపిసైన్యములతోడ గదసి దనుజ । బలములు పోరాడ పటుదర్పమున నింద్రజిత్తుడ వ్యోడదీప్తసితశరములు । కపులద్రుంచుచునుద్దండగతి నిమింట । మెరసియాచుణచు శ్రీరఘువరులనఖిల । వనచరుల లీల బడవైచి విషమధగదల । నతిజవంబున తనలంక కప్పుడరిగె ॥

వ ॥ అంతట విభీషణుండధికయత్నంబున నాంజనేయుం గనుంగొని చింతాక్రాంతుండై జాంబవంతుండెచ్చట బడియున్నవాడో యామహాత్మునింగాంచితిమేని యాపన్నివారణకారణంబగు సౌపాయంబెఱుగింప గలవాడని పల్కి యుతనింగూడి చని చని జాంబవంతుం గనుంగొని ప్రాణంబులతోనున్నవాడవె యని యడిగిన

నలుం డతని ముఖంబవలోకించి హనుమంతుం డెచ్చటనున్నవాడతండు జీవించియుండునే యని యడిగిన విభీషణుం డతని జూచి రామలక్ష్మణసుగ్రీవాదులనందర వర్జించి హనుమంతు నడుగనేల యనిన హనుమంతుండొక్కండు జీవించియున్న నందరం బ్రతికింపగలండని పల్కిన యనంతరంబున హనుమంతుండరుదెంచి తన గోత్ర నామంబులు చెప్పి నమస్కరించిన నతనితో జాంబవంతుం డిట్లనియె ॥

కాంభోజిరాగము-ఆదితాళము-

హనుమంత నీవు బోవోయి । దివ్యౌషధములు । ఘనవేగమున నుదే వోయి ॥ మన రామలక్ష్మణులిమ్మహీ మూర్ఛనొందియున్నారనసంభవాంగదాదివనచరకోట్లతోడ ॥ ౧ ॥ నినునమ్మియున్నవారము । నాలంద్రి సీమీపని జేసికీర్తి వడయుము । నినుబోలు వీరులీభువనములలేరునీ । వత్యనుపమోదగ్రబలుడవ సహాయశూరుడవు ॥ హ ॥ ౨ ॥ ధరణిపై కళింపనేతుణవు । దుర్ధరకనక । గిరినితలక్రిందొనతుణవు । గరిమెనీ వెద్దియైనకడగి యొనగూర్పగల । వరదుగరంగ వురవరులమేలాత్మగోరి ॥ హనుమంత ॥ ౩ ॥ వ ॥ ఇట్లుబలికి దివ్యౌషధులకుం బోవు మార్గంబును యాయౌషధుల లక్షణంబులునుం దెలియనేరింగించిన ॥ క ॥ హనుమంతుఁడంబరంబున । చనిచని దివ్యౌషధాద్రి చయ్యనగని పావనమగు నయ్యౌషధులను । గనజాలక పర్వతంబు కదువడిబెరికెన్ ॥ ద్వి ॥ అంతట గంధర్వులాచుణచుదాక । పంతంబుతో వారిభంగంబొనచి । గిరిమోసుకొనివచ్చె నవలలీల । సరగున కపిసైన్యసన్నిధినిలుప । ఘనమైనయౌషధగంధంబుసోకి । వనజాప్తకులజులు వనచరవర్గ । మరుదుగాలేచిరయ్యెడనిద్రబొంది । గరిమలేచినవారికై వడిదోప ॥

సౌరాష్ట్రరాగము-ఆదితాళము-

కపివరులయ్యోశగదసిమహోగ్రతగాల్చిరిలంకపురము । సురగణదానవదుర్ధరము । యపరిమితములగుహయరథమత్తద్విపశాలలు బహువీథులమండగ ॥ ౧ ॥ మణిమయసౌధసమంచితగోపురమంటపనగరములెల్లా । యనలునిమంటలప్రగ్గుచుడొల్లా । కన

వ ॥ అంత రావణుండు దురంతచింతాక్రాంతుండై ఖరపుత్రుండగు మకరాక్షుంగనుంగొని ॥ చ ॥ వనచరులంరఘూద్వహులవాడి శరాగ్నులజంపిరమ్మనం । వినిప్రణమిల్లి రావణుని వీట్కొని హేమరథాధిరూఢుడై । దనుజవితానముల్ గొలువ తద్దయసంగరకేళిగోరుచుఁ । జనిచని కాంచితాకసురసంఘముభీతిలరాము సైన్యముఁ ॥ గీ ॥ యిట్లుదాకికపులనెలమిభంజింపంగ । బారజొచ్చిరతులభయమువలన। ఖరసుతుండురాముఁగదసిగజీఁల్లుచు। బలికెనపుడురామభద్రవినుమ ॥

యదుకులకాంభోదిరాగము- జంపెతాళము,

ఒక్కితివి శ్రీరామ। చిక్కితివిరఘురామ । చిక్కితివినాప్రోల సీతాభిరామ। గరిమమజ్జనకుఁడగు। ఖరునిజంపిననిన్ను । పరగదుసుమాడియాపగదీర్చఁగనుందుఁ ॥ ౧ ॥ ఘనబాణములను। నీతనువురక్తమొనరించి। జనకజకుకన్నీరుస్రవియింపజేతుఁ ॥ ౨ ॥ శరములనుగొని । ప్రాసగదాదులనుగొని । నేరిగోరుమనిశాయనీకెయ్యదనువో ॥ ౩ ॥ రామశ్రీకరరంగధామనినువధియింతు । భీమాస్త్రవర్షమికపెలుచగురిపించి ॥ ౪ ॥

క ॥ అనవిని శ్రీరఘునాథుడు।వినరోరిదురాత్మచాలవెసప్రేలకు। నిన్ననిసంహరింతునిర్వ్యాడ। ఘనతరకార్ముకవిముక్తకఠినాస్త్రములఁ ॥ వ ॥ ఇట్లుబల్కిన మకరాక్షుండత్యుగ్రుడై రఘువల్లభుమీదబాణవర్షంబుగురిపించె నయ్యిరువురు దేవగంధర్వాదులంబరంబునంజూచుచుండ చిత్రంబుగాపోరుగావించిరత్తరి కౌసల్యానందనుండనలాస్త్రంబున సద్దనుజవీరునిం జెగటార్చెఁ సంతహతశేషులయిన రాక్షసులు రక్షోవల్లభునకెరుంగించినం గోపంబున దంతంబులుపటపటంగొరికిసమరోత్సాహసంపన్నుండగుయింద్రజిత్తుం గనుంగొని నీవీక్షణంబునం జని రామలక్ష్మణ సుగ్రీవ ప్రభృతులం గూల్చి రమ్మనినవాడును యుద్ధసన్నద్ధుండై సైన్యంబులంగొని ॥

మధ్యమావతిరాగము- ఆదితాళము-

సాక్షాద్బ్రహ్మముడనవడలేను రావణిసమరక్షోణికిని । అక్షీణోగ్ర

బలంబున గెలుచుటకగ్నలహోమంబమరనొనరించియు । తురగ
గధవళఛత్రము మెరయ రథస్థలి వెలయుచును । గరిమ రంగపురవరుని బ
లంబులు వెరపున బరువగ నరుమగ నాచూచు ॥ సాత్త్వాద్యముడన ॥

గీ ॥ రథముతోడ నదృశ్యుడై రఘువరులను । కపిబలంబుల నుద్ధం
డగతినితీవ్ర । నిశితబాణపరంపరల్ నిగుడజేసి । చాలనుక్కించె
రాక్షససైన్యము బ్బా॥ క ॥ పిడుగుల బోలెడి శరముల । కడువడి స్రు
క్కింపయన్నగనిలక్ష్మణుడి । వ్యోడ బ్రహ్మాస్త్రము చేజ । క్కడ చె
దనికపీని । దనుజగణముల నెల్ల ౯ ॥ గీ ॥ అనిననాకనికష్వసందరవ
ధియింప । జను నెడాగియున్న శరణటన్న । పరువుచున్నగదిసి ప్రా
ణముల్ బాపుట । కిలను శూరులొప్పరిప్పనికిని ॥

వ ॥ ఇట్లు బలికిన యనంతరంబున నింద్రజిత్తుండవార్యశౌర్యుం
డై పిడుగులం బోలు బెడిదంపు తూపులనందరం బడలుపరచి సమ
రంబు చాలించి లంకకుం బోయి క్రమ్మర రణంబునం గూలిన కుంభ
కర్ణ ప్రముఖ రక్షోవీరుల నాశనంబు మనంబునం దలంచి మా
యానైపుణ్యంబున సీతాస్వరూపంబు నిర్మించి యాసీతం దనరథం
బుమీద నిడుకొని రణరంగంబునకుం బోయి హనుమత్ప్రముఖ కపి
బలంబులెల్ల కోపంబున మాకొనిగదసి చూచుచుండ యద్దవిశిరో
రుహంబులు బట్టుకొని జంపంగమకించు సమయంబున యాసాధ్వీక
న్నీరునించుచు నిట్లనియె ॥

పున్నాగరాగము-అటతాళము.-

హా రఘువీరా । కావుము రక్షోవీరవిదారా । హా రామ రామనన్ని
రాక్షసుండసి । ధారను దెగ వ్రేయదపించుచున్నాడు ॥ నను బ్రో
వవేమి । హా వల్లభ నా నేరమేమి । నినుజూచి ప్రాణములనువుగవిడి
చెద । ఘనరంగపురవాసగనుపించుమొకసారి ॥

గీ ॥ పులిసమీపమందు వెలయుచున్న కురంగి । చందమొందియు
న్నసకియజూచి । పవనజుండు శోకబాష్పసమేతుడై । బలికనిట్టుల
నుచుపగతుతోడ ॥

శ్రీరాగము-అటతాళము.-

విసర । బుద్ధివిసర । అపురావోరి ॥ విసర ॥ వోరాక్షస ॥విస ॥

విసరానీవవనిసత్యనుపమ బ్రహ్మ। పావనవంశమునబుట్టివనితజం
తగనేల ॥వి॥ యీకార్యముకీడుదెచ్చునులంక। వీకశేయుదునుపా
డు। నీకేమియపరాధమికాంత్తయొనరించె। నాకుజెప్పరదుమహా
దాకరదుశ్శీల ॥వి ॥ ౧ ॥ వలదుచంప్పవలదు। నిందలనొందవల
దు। తెంప్పవలదు। వలనొప్పనడవులవసియించిపతిచాశి। నలకు
వజెందియస్సదిరదుఃఖముతోడ॥వి ॥ ౨ ॥ యేరదువికారా।యీ
విధమతిఘోరపాపహార। యీరామనకటవిదారించూనితి । వా
రప్రిజజ్మఘోరా?ఽదగ్ధము గాను ॥వి ॥ ౩ ॥తగునధర్మమగున।న్యా
యముదప్ప । పగునహింసదగున।సుగతిగోరకరంగేతుచెలిజంపిన॥
నగణితలీలనిస్సపనిగూల్పకమాన ॥విసర ॥ ౪ ॥ ద్వి ॥ అనియిట్లు
బలుకంగనయ్యింద్రజిత్తు।వినిహనుమంతుని వేట్కతోజూచి। యె
కాంత్తై మీరలేతెంచినారొ।యీకాంతనిప్పుడేననిద్రుంతుననుచు ॥
కరమననుగ్రుడై ఖడ్గంబుదాల్చి । గరితనుదెగనేశెకతీనాత్మజగు
చు। సంతటకపులయాహాకారమెసగ। చింతించుచునుభారచెలగి
యక్కపులు। పురికొల్పుకొనివాయుపుత్రుడవ్వేడను। కరమొప్ప
నసురులకడువడిద్రుంచి । శైలమొక్కటిదెచ్చిశక్రారిమీద। కా
లాగ్నివలెమండికట్టలుకనేయ । సదిదప్పిపోవుటకరదంబుద్రిప్పి ।
వదిలుడై కపులదోర్బలమునసొంచె। హనుమంతుడంతటనతిశోక
మమర। గనిపల్కెకపికోట్లకన్నీరువెడల॥

ముఖారిరాగము- ఆదితాళము-

కదలిపోదామికనురందుకదనమేల। లోకకళ్యాణిగోల్పోతిమిక
విక్రమములేల ॥ తడబడుచున్నాదినాపాదద్వయంబు । మనము
జలధిగడచివచ్చుటనిష్ఫలకరంబు ॥ ౧ ॥ ధరణిసయయోనాశాత
లువ్యర్థంబులాయస్వామి । కరుదుగదువార్తదెలుప నహా
మాయ ॥ ౨ ॥ వలనొప్ప శ్రీరంగపురనిలయుతోడ।దెలుపవలయు
సీతకైనవిధిజవంబుతోడ ॥ ౩ ॥ వ ॥ యిట్లుబలికి హనుమంతుం
డారాముపాలికరుదెంచుచుండె నింద్రజిత్తుండితైరంగుననందరం
దనమాయవలన మోహంబునొందించి నికుంభిళా హోమంబు
గావింపుచుండె రామచంద్రుంచు పశ్చిమభాగంబునంగలిగిన మ

హారవంబాలకించి వెరగుపడి జాంబవంతుంగనుంగొని హనుమంతుండు కయ్యంబుగావించుచోట రోదలువినంబడనయ్యెంగావున నామనంబునగలంకుచున్నయది నీవరసిరమ్మనిబనిచిననతండుతీవ్రంబునంబోయి మార్గంబునవచ్చుచున్న మారుతింగాంచి సీతావృత్తాంతంబువిని దుఃఖితుండయ్యె పవనజుండాసమయంబునంగన్నీరునించుచు రామచంద్రునింజేరవచ్చి రావణిగావించిన మహాకృత్యంబువిన్నవించిన ప్రచండమారుతంబునం బడినవృక్షంబు చందంబున నవనింబడి మూర్ఛిల్లినంజూచి కపిగణంబులాహాకారంబున పద్మోత్పలసుగంధకలితంబగు సలిలంబు దెచ్చి మేఘశ్యామసుందరంబగు రామచంద్రునిశరీరంబు శైత్యోపచారంబుగావించిరంత ॥ గీ ॥ అన్నగనితమ్ముడత్యంతఖిన్నుడగుచు। బాహువులుసాచికౌగిటబట్టినిటి పి।పరశఘూస్వప్నసీకేట్టియాతిఃకల్లి।నేమిశేయుదు నెబ్బంగ్గినిల్లక్షసింతు॥

మధ్యమావతిరాగము. ఆటతాళము.

అకటధర్మముగావజాలదాయె। వోయన్ననీకాపదలాయె। ప్రకటధర్మవ్రతపరుడవైజగతి। నత్యకంకసత్యశీలాదులగలసిన్న।కట॥ ఘనధర్మవతిఃనటంచు। జనకునమాటదీర్పనటంచు। వనమునకరుదేరవనితగోల్పడనాయె॥ మనసెంబొందినరాజ్యముమానితయుయోని। న్నకట ॥ ౨ ॥ కరగతమ్ము నన్నధర్మవ్యంబు। పోదరమినగలదెసుఖంబు। వరరంగనాధరావణుడుధర్మముదప్పి।నెరిసౌఖ్యమొందెనిన్నారశదుఃఖములెల్ల ॥ నకట ॥ ౩ ॥ క ॥ ధర్మముసౌఖ్యమటంచున। ధర్మముదుఃఖంబటంచుధరజెప్పుదురా। ధర్మంబునసంతాపము। ధర్మంబునసుఖములగుచుధరనిపుడొప్పెన్॥

క ॥ ధనవంతుడుత్తముడుభువి।ధనవంతుండతులబలుడుధర్మజ్ఞుండున్। ధనవంతుడవనిపూజ్యుడు। ధనవంతునకలరుహితులుతగుబంధువులన్ ॥ వ ॥ అన్నా రావణివలనంగాబడినపాపకార్యంబునకు బ్రతివిధానంబన్నదియ్యె కార్ముకవిముక్తచండ కాండంబుల సకలరాక్షస సమేతంబుగా లంకాపురంబు భస్మంబుగావించెదంగావున నీప్రభావంబునీవెరుంగి కూర్చుండి ధైర్యంబుగొ

నుమని పలుకన్మన్న యా డమీభీమణుండరుదెంచి సర్వవృత్తాంతం బె
రింగించి యింద్రజిత్తుండుతనమాయవలసంగావించినమిథ్యాకా
ర్యంబని తెలసిరఘువరుసకిట్లనియె ||

మారువరాగము-ఆది తాళము-

యేమయ్యారఘువర్యపుఃఖమేలనయ్యా | సీత | భామాకుమంగళ
మయ్యాభక్తసేవ్య || యెన్నగనభిశుష్కింౘెనన్నమాట| నమ్మకు
న్నరీతిగాదెనమ్మకున్నమాట || ౧ || క్షేమమయ్యాక్షేమమయ్యారా
మరామ| నీక్షేమమాత్మగోరుసీతరామరామ || ౨|| రావణిమా
యలునమ్మరాదుజగతి| వానిభావింపముజ్జగములందు ప్రకటమూర్త
తి || ౩ || వలదువలదులేసిదుఃఖమలఘుశౌర్య | రంగస్థలవిహారరౌ
ద్రమేరుశైలధైర్య || ౪ || వ || అనివిభీషణుంబలికి మనక
ప్రభో రావణాత్మజుండిప్పుడు నిష్ఠాగరిష్ఠుండై నికుంభిలా హో
మంబుగావించుచున్నవాడా హోమంబునిర్విఘ్నంబుగా పరిపూ
ర్ణంబైన నజేయుండై వెలయుంగాన హనుమత్ప్రముఖకపిబ
లంబులతోడ సౌమిత్రినినావెంట బంపు డేను హోమంబు విఘ్నం
బుగావించి చంపించెదనని పల్కిన యవ్వాతెఱ కర్ణామృతంబు
గావిని రామ లక్ష్మణసుగ్రీవహనుమత్ప్రముఖుల పరిమితానం
దంబునం జనుదెంచి విభీషణుంగౌగిలించ సంభావించిరట్టియెడ||

సీ || అంతట శ్రీరాఘవాజ్ఞచేలక్ష్మణుడింద్రజిత్తువధింప నెలమి
దలచి| ఘనబాణకార్ముకకవచఖడ్గంబులుకడువేడ్కతోదాల్చికడి
మిమెరసి | తనయన్నపాదంబుప్రదక్షిణంబొనరించి మ్రొక్కి దీవన
లొందిముదము నెంటి| శౌర్యబలాటోపశక్తిసంయుక్తుడై హనుమ
దాదిబలంబులాశ్రయింప | సచివయుక్తంబుగావిభీషణుడు వెల
య | బలములొప్పంగభల్లూకపతిచెలంగ | సంగదాదులుతనజ
యంబాత్మగోర| ననికివేంచెశరఘుకులేంద్రానుజుండు||

క || చనిచనిరాక్షససైన్యం | బనుగవాసముజొచ్చెనప్పుడసురు
లగచరుల్| ఘనకదనముసలిపిరిసురు| లనువుగనాశ్చర్యమొందనతి
దర్పితులై || వ || అంతటలక్ష్మణుండు విభీషణానుమతంబునవి
డుగులంబోలుభల్లంభులింద్రజిత్తుమీదవైచి రాక్షససైన్యం బులం

గలంచిన నింద్రజిత్తుండుగ్రుండై హుమంబుచాలించిరథారూఢుండై చనుదెంచి విభీషణునకిట్లనియె ॥ గీ ॥ అన్నమైదబాసిపిద నరాధములను । చేరికులమెల్లరోయఁగనిగ్గువిడిచి। భృత్యభావం బుగొంటివిపూజ్యమనుచు। నీచచారిత్ర నెలసెబోసి దుసడత ॥

గీ ॥ గరిమపినతండ్రివయ్యుండికరుణలేక। నరులగొనివచ్చితెక టసీవవనినింద। జెందమదిగొంపాపాత్మచేసటివగుచు। కపులనిమ రాఘవులద్రుంతుకడిమిమెఁసి ॥ వ ॥ ఇట్లుబల్కినవిభీషణుండింద్రజిత్తుంగనుంగొని ॥ క ॥ మునులవధింపుచుయన్యాం । గనలను చెరనిడెడియన్నకడనుండసునా। మనసొచ్చునె దుష్టాత్మక। నినులక్ష్మణుడిలవధించునిమిషములోనఁ ॥

కళ్యాణిరాగము-ఆదితాళము.

చెలగిలక్ష్మణేంద్రజిత్తులయ్యెడ। చేసిరనినగధైర్యులై ॥ కులగిరులు। సింహములుగ్రహములు। ఘోరముగదలపడినతెరగునఁబం పడికరములను। కార్ముకములుకడుమెరయగను । శంకృతులలరగ సేయుచును। శరములుచలమునబరపుచును। జలదతతులితరవము లహుమ్మనుచును। బలిమిగజెలుచుపటునారాచము। లలుకనేసి తనువులనొన్యోన్యను వెలయరక్తధారలుదొరగింపుచు ॥ చె ॥ ౧ ॥ గరిమతోడనొకరినొకరలఘగకాంతి గలిగిగదసి । సరగునవిశిఖములురువడిగొనుటలు। చాపములనుసంధించుటవేయుట । లెరుగనలవిగాకఁ।సురగణమరుదుగగనవీకఁ। తూపులుచురుకుననొగిదాకఁ। మూర్ఛలబొరయుచు। పౌలిబోకఁ। వరమడగుచుదనరినరంగస్థల। వాసునిసోదరుడసురేశునిసుతు। డిరువురుదుర్భరశరకాండములంబరమిలనిండగ ఘురుతుగసేయుచు ॥ చెలగి ॥ ౨ ॥

వ ॥ మరియు నవ్వీరవర్యులత్యంత మాత్సర్యంబున దివ్యాస్త్రప్రయోగంబులుగావించిలోకంబులఘూర్ణిల్లఁజేయుచుశతసహస్రసంఖ్యాకు బాణంబులొక్కుమ్మడిబరగించుచుబోరునెడలక్ష్మణుండైంద్రబాణంబుచాపంబునసంధించి రాఘవేంద్రునిపదకమలంబులు మనంబునందలంచి రామచంద్రుండుసత్యధర్మపరాయణుండేనియు యిమ్మహాబాణంబింద్రజిత్తుని నిర్జీవుం గావించు న

ళిరమేసెన ॥ క ॥ పెనుమంటలెగయశక్రా । శనితుల్యంబగుచువే
గజనిరావణిశో। ఘనరత్నకుండలాంచిత । ఘనమస్తకమువుడుడు
నుమశదువడిబడియెక్ ॥ గీ ॥ సురులుగురియించిరవ్యోడవిరులవా
న। గరిమనాడిరిదేవతాకాంతలెల్ల । మునులుహర్షించిపొగిడిరి
మొనసిసర్వ । వనచరానీకమత్యుత్సవమునవెలసె॥

వ ॥ ఆసమయంబున ॥ ద్వి ॥ హనుమద్విభీషణులత్యుత్సవమున।
వినుతింపనారఘువీరునితమ్ము । డనువొందకపికోట్లనందరగూడి ।
చనితనయన్నకుసాగిలిమ్రొక్క । నంతవిభీషణుడారామచంద్రు
సంతసంబునగాంచిజయమయ్యెమనకు। సమసెరావణినేడుసౌమి
త్రిపలన। సమరస్థలినటంచుసమ్మతిజెప్ప । గరిమెతోతమ్మునికౌగిట
జేచిరా। శిరమమూర్కొనికేలచెక్కిళ్ళుదువ్వి।ఘనరుధిరార్ద్ర
మౌకాయంబుజూచి। కనుదమ్ములనుసీరుగారంగహస్త । మునసం
టుకొనుచుతమ్మునిఁబిలోకించి। నెనరుచిత్తములోననివ్వటిల్లంగ ।
నాయన్ననీవిట్లునావెంటవచ్చి । బాయకకష్టముల్‌బడితివిద్ధర ।
చెలగిదుర్జయునింద్రజిత్తునిజంపి। తలఘుశౌర్యంబుననానందమ
య్యె । నేసింకవధియింతునిష్టురాస్త్రములు। పూనిదశగ్రీవుపాలు
పెల్లదూల। ననిపల్కెనయ్యెడనాలంకలోన । తనయుండుజచ్చు
టదైత్యులవలన।వినిదశగ్రీవుండువెసమూర్ఛనొంది।మరలచయ్యె
నలేచిమానసమందు। వరపుత్రునయ్యింద్రవైరిదలంచి॥

పున్నాగరాగము-ఆటతాళము.

హావీరభూషణహావైరిహరణా। హాపుత్ర ఘోరతరాహవనిపు
ణ॥ సరగుననను బాసిచనన్యాయమగున । వరపుత్రనినుబాయవశ
మునాకగున ॥ ౧ ॥ అహహానీవిక్రమమణగిపోయనుగ। యహహ
నీశౌర్యమయ్యావనిగలసెగ ॥ ౨ ॥ మాయలన్నియునేర్చేమాయ
మైచనెను । బాయరానినిన్నుబాసితిధరను ॥ ౩ ॥ వరరంగపతిపో
దరుడుతూపులను। బోరిగొనెగదనిన్నుభువనభీషణుడు॥౪॥

ఇవ్విధంబునందుఃఖించి మహోగ్రక్రోధావేశంబున రాక్షసు
ళంగనుంగొని మత్పుత్రుండువనచరుల వంచించుకొరకుతనమా

యువలన సీతాస్వరూపంబుగావించి తెగటార్చె నేనిమ్యోడసత్యంబుగాసీతందెగవ్రేసెఖడ్గంబుగొని ప్రమదా వనంబున కరిగి జానకింగాంచిరయంబునంజనుదెంచునెడయుద్ధవివానిం గనుంగొనిదుఃఖింపుచు॥

## సావేరిరాగము- అటతాళము-

యేమిసేతునేమిసేతుహా మోహానాంగ । రామరామననువధింపరావణుడుగ్రుడ్డై వచ్చె ॥ నేమి ॥ యేలబొమ్మంటినిన్నలనా । దేనుమాయామృగము వెంట ॥ యే ॥ యిట్టికష్టములకే కాదో వెనుమరదినట్లాడుట ॥ ౧ ॥ నాథసీదానన్నై రక్షో । నాథుచేజావగనాయ ॥ యే ॥ పావనివీపెక్కి-పోక । ప్రతికూలములాడితి ॥ ౩ ॥ నిన్నుబాసియున్నవేళ । నన్నుబాములొందకున్నె ॥ శ్రీకరరంగపురీశ । కైకకోకేదీరెనేమో ॥ ౪ ॥ సీ ॥ వెలదిజానకియిట్లువిలపింపరావణుండవనిజవధియింపనగు.గుడేర । కనిసుపార్శ్వుడు దశకంఠునకడ్డమై దనుజేంద్ర వనితనుధరవధింప । తగునయ్య ఘోరపాతకకార్యమిదిమానుపగగల్గి ననురఘుప్రవరులైన । రామలక్ష్మణులవిక్రమ మొప్పనిద్రుంపుమననిజాలయమునకరిగిసభకు । మతులజనుదెంచిరాక్షసవరులబిలచి । తురగసామజరథభటస్తోమమలర । వేగమునబోయిశ్రీరఘువీర। వానరాదులనుజంపిరండుమీరాహవమున॥ ద్వి ॥ అనియిట్లుబలుకనద్యసురులుబోయి । వనచరావళిదాకివరబాణఖడ్గ । ముసలముద్గరగదాముఖ్యముల్ప్రరపి । వెసజంపగనిరఘువీరుండుచాప । నినదంబుగావించినిజరిపుల । వెనుకొనిబహుబాణవితతులుగురిసి । కరులరథంబులకాల్బలంబులను । వరఘోటకంబులపడిఁజెగటార్చె । ధరణిమహాద్దండదర్పంబెలర్పె । గరిమశోభిల్లంగగనిహతశేష । లరుదుగాజనిచెప్పిరసురేంద్రుతోడ । కరమొప్పనంతరరక్కసులవెలందు । లింటింటహాయనిమెచ్చుచుపతుల । జంటబాసుటనుమహాఘోరలజెందువారు । తనయులనన్నలతండ్రులగూర్చి । మొనసిదుఃఖాంబుధిమునిగెడివారు । వంచనగావించివైదేహిఁదెచ్చి । ముంచెబోయీలంకమహాఖండటంచు।నిందించినిట్లూర్పునిగుడించువారు ।

క్రథమనమరణంబు కాంక్షించువార। లగుచుమహాఖేదమతిశయిల్లం
గ। మగువలెల్లనుగూడిమాటలమించి॥

ముఖారిరాగము. ఆదితాళము.

యెంతచేటుగల్గెనమ్మ। వోయమ్మరాక్షసేంద్రుడెంతమూఖుడ
డమ్మ। యింతిగోకై కకువరము లేలయొసగెనమ్మభర్త। కాంత
తో శ్రీరాముడేలకానలకువెంచేసెనమ్మ ॥ యెంత ॥ తప్పులెల్లమ
నవెనమ్మ। పనశాలకుచుప్పనాతిబోనేలనమ్మ। తప్పిపోయె బో
రఘువరులతవిలికదియనేలకనుల। గప్పినదీనికామాంధకారమగ్ని
పాలుగాను ॥ ౧ ॥ యేమినేరములులేకను। వనవాసుడౌ శ్రీరా
ముభార్యతాచేనేలను। యేమమ్మదానికేకాదసామీరిజలనిధిదా
టి। భామతోభాషించియక్షునామమణచిలంకకాల్చె ॥ యెంత ॥
౨ ॥ వినడాయెవిభీషణోక్తులు। మేఘనాథాదులనిద్రల్లిరద్భుత
శూరులు। వనితరో రాముని రంగవాసుడనుచుదెలియడాయె। విన
వమ్మవీనిక్రొవ్వెల్లవెసధాత్రిదగ్ధమైపోను ॥ ౩ ॥

క ॥ యీరీతితనపురంబున। భూరివ్యసనమునబల్కుపాలతులప
లుకుల్। యారావణుడాలింపుచు। ధీరతరణరంగమునకుతెంపున
వెడలెన్ ॥ చ ॥ కరులురథంబులశ్వములుకాల్బలముల్తనవెంట
నొప్పభీ। కరశరచాపఖడ్గపరిఘప్రకరంబులుదాల్చి। హేమసుం
దరరథమందుతావెలసిదపడమెలపడగవానరావళిన్। సరసీజమి
త్రవంశజులచంపుదునంచునుదగ్రమూర్తియై ॥

వ ॥ మహోదరమహాపార్శ్వ విరూపాక్ష ప్రభృతులతోడం
జని యవ్వానరానీకంబులందాకి నిసితబాణపరంపరలవలన నా
శంబునొందింపుచు దేదీప్యమానంబుగావెలుంగుచున్నయెడసుగ్రీ
వుండరుదెంచి శిలావృక్షవర్షంబున రాక్షససేనాక్షయంబుగా
వింపుచు విరూపాక్షుతోడందలపడి ఘోరసంగ్రామంబుగావిం
చి ప్రాణంబులుబాపె నంతరావణానుమతంబునమహోదరుం
డురువడించి కపిసైన్యంబులంజీకాకుపరచినభానునందనుండత్యం
తయత్నంబునంబోరిపోరి యవ్వీరునినిగతప్రాణుంగావించె న
ట్టియెడ ॥ సీ ॥ కోపంబుతోడమహాపార్శ్వుడయ్యెడవనచరావ

శిలాకి వసుధగూల్ప । కని వాలిసుతుడుదగ్రత నివామాకొ్కని స
మరంబుగావించి సంహరింప । రావణుడతులదుర్వారశౌర్యంబున
కాలాగ్నితుల్యుడై కపిగణముల । సమయింపుచును దాయ జానకీనా
థుండు తమ్మునిగూడి దోర్దర్పమమర । శరశరాసనములు బూని స
మరమునకు । నిలిచియుండ విలోకించి నిర్జరారి । విశిఖవర్షంబు
గురియింప వేడ్కగాంచి । బరపె సౌమిత్రి పటుబాణసంక్తులపుడు ॥
ద్వి ॥ రావణుండంత దుర్వారుడై యమించి । పావకతుల్యమౌ బా
ణముల్ బరపి । రామసోదరు బాణరాజిని గ్గాడి । రామచంద్రుని
డాసి రయమునను గ్ర । సితసాయకము పెంజీకటి నేయ । నతికోప
మున రాముడసురేంద్రు తోడ । నతులవిక్రమ మొప్ప నని సేయ జూ
చి । జతలేని దీప్తి సౌమిత్రి ఘోర । శరములదైత్యేంద్రు సారథి
దునిమి । గురుతరధ్వజము లగూలంగ నేసి విలుద్రుంచె నసిబుష వీరు
లు మెచ్చ । వలనొప్ప నవ్యాజ వగరాహాస్తు । డగుచు నిశ్చేషణుడ
స్త్రశస్త్రముల । తగగూల్ప నాతడున్నంతుడై శక్తి వెసదాల్చి తమ్ము
నిత్రెయంగ నప్పు । డసదృశకరుణార్ద్రయగు రామతమ్ము । డది
త్రుంపన మరారియాగ్రహంబలర । పదిలంబుగా నొక్క పటుశక్తి
బూని । యా విభీషణు జంప నాత్మ దలంప । పావనుండగు రామభద్రు
నితమ్ము । డాతనికడ్డమై యసురేంద్రు మీద । శాతమార్గణములు
చయ్యన గురియు । కసలి సౌమిత్రి నుగ్రంబున గాంచి । నిసుధరాస్థలి
గూల్చనిక్కమీశక్తి । గనుగొనుమని త్రేయగని రాఘవేంద్రు । డనె
తమ్ము డొకిస్వస్థియగునని ప్రీతి । సంతట శక్తిమహాధ్వనుల్ దసర । విం
తగా దీనులై వేల్పులు చూడ । మంటలు గ్రక్కుచు మహిమ సప్ప । ఘుం
టికాయుక్తమై కడువడి వచ్చి । రామానుజుని పెన్నురము నగాడ ।
నామహామహు డంతనవనిపై బడియె ॥ గీ ॥ అవని బడియున్న లక్ష్మ
ణు నట్టె జూచి । జానకీనాథు డతిశోకజలధి మునిగి । సారిదియాతని
యురము దూటుచొచ్చియున్న । శక్తి పెకలించి భంజించె జనపరేణ్య ॥
వ ॥ అంతట దశగ్రీవుండు దగ్రసనస్కుండై విశిఖపరంపరలవ
లన రాఘవేంద్రు గప్పం దొణంగిన సైరింపుచు మఱి ఖావేశంబున నం
దమ్మునిం గౌగిలించుకొని యవ్వీరుని భక్తి విక్రమపౌరుషంబులు దలం

చి సంతప్తచిత్తుండై ధైర్యంబు గోని హనుమత్సుగ్రీవ ప్రముఖు
లంజూచి మీరెల్లవారలు లక్ష్మణుంగాచి యుండవలయుని య్యెడ
పరాక్రమంబుచూపుటకు కాలంబుగాని చింతింపనహంబు గా
దేను రావణుంగదసి మదీయ్యావిక్రమప్రతాపంబులుజగంబులం
గీర్తించంపుచుండ నారామత్వంబుగనుపరచెదనింకనీలోకంబునరా
మరావణులమగు మాయిరువురలోననొక్కండై యుండవలయు
నని బల్కి మహాగ్రక్రోధాతిశయంబున ధనుష్టంకారంబు గా
వించి చండకాండంబులప్వీరుని దేహంబుగాడనేయ నారాక్షసే
శ్వరుండు కొంతదడవు రామచంద్రునితోడనద్భుతసంగ్రామంబు
జేసి రణరంగంబుననిలువంజాలక లంకాపురంబు సొచ్చెనప్పుడయో
ధ ॥ గీ ॥ అంతసీతేశుడతిశోకమావహిల్ల । ధరణి బడియున్నత
నసహోదరునిజూచి। కన్నుగవనశ్రుకణములుగ్రమ్ముచుండ। చా
లవిలపించెవనచరుల్ జాలిబొంద ॥ ద్వి ॥ హారఘుకులవీరహామ
హాశౌర్య। హారాక్షసాంతకహాసహజన్య। నీకిట్టిదురవస్థనేడేలక
లై। నాకురాదాయగానాతండ్రినీకు। కలగుణంబులనెల్లక్రచ్చె
రబోగడ। నలవియేముక్కంటినలులలకైన। గరిమతోననుబాడ
కాంక్షింపవేమి। సరగునలేలెమ్ము శక్రారిహరణ ॥

వ ॥ ఇట్లు బల్కుసుషేణుంగనుంగొని ॥

సురటరాగము — ఆదితాళము.

యేమిసేయుదుసుషేణ। నాదుఃఖమెట్లుదీరునుసుషేణ। స్వామి
త్రినాబహిశ్చరప్రాణమసనొప్పి। తామహీస్థలిప్రాలిపల్లడను
గటిగించె ॥ యేమిసేయు ॥ నేనెంతదురితుండనో। పూర్వమందేనెట్టి
చరితుండనో। నేనెంతదుర్జశాన్వితుడనో। లేకున్నదానవేంద్రు
నివలనతమ్ముడిలగూలునా ॥ యే ॥ ౨ ॥ సమరమికనాకేలను। దై
త్యేంద్రు సాధించుటదియేలను। కమలాక్షిసీతనికనైకొన్నఫలమే
మి। విమలరంగస్థలిని వెలయుతమ్ముని బాసి ॥ యే ॥ ౩ ॥

వ ॥ ఇవ్విధంబున విలపించురఘువరేణ్యునకునవినయంబుగా
సుషేణుండిట్లనియె ॥

శుద్ధకాంభోదిరాగము- త్రిపుటతాళము.

సకలజ్ఞుడగునీకుజనుసయ్యయీచింతజనకజారమణరామ ॥ శ్రీ శటుడగుసౌమిత్రికకటశవచిహ్నాలేదికమానుదుఃఖమేలచాల ॥సక॥ శరదిందుసమముఖస్ఫురితనొప్పెనదెసు ప్రసన్నాదిలక్షణములు । కరపద్మములరక్తకాంతులొప్పచున్నవరుదార భయములేదు లేదు ॥సక ॥ ౧ ॥ కనుదమ్ములత్యంత కరుణాప్రసన్నశోభనములై పొలుపొందెను। ఘనమైనహృదయముశ్వాసనయుక్తంబగుచుదనరె నిదెరిపువిరామ॥రామ ॥ ౨ ॥ మృతుడుగాడితనికతిమోహనాక్రమించెనితడుదీర్ఘాయువమరి । నుతిజెందుశ్రీరంగపతిసోదరుండనగనతజనగణార్తిదూర॥ధీర॥సకలజ్ఞ ॥ ౩ ॥

వ॥అనిభాషించియునంతట। హనుమంతునిజూచిరఘుకులాధ్యక్షునితమ్మునిబ్రోవుమౌషధంబులు । ఘనకరుణామతినిదెచ్చికళ్యాణముగాదె॥

కందార్థము.

మునునీకుజాంబవంతుడు। పసిబడివివరించెద్రోణపర్వతమున । సొంపునవెలుగుయౌషధంబుల । కనువుగజనితెచ్చుతెరవులగవరధీర। నీవచటికిజనుముపెంపార। మాకోర్కెలింపునను చేకూర। ఘనతరశ్రీరామకార్యధురంధరు। డనసౌషధములుచయ్యనదెమ్ము॥ అగవరధిర ॥ ద్వి ॥ కరమొప్పసంజీవకరణిసౌవర్ణ్య । కరణియుసంధానకరణివిశల్య । కరణియనందగుఘనతరౌషధులు । పరగద్రోణాద్రిపైభాసిల్లుచుండ । పర్ణములెల్లసఫలములుపచ్చ । వర్ణింపనెన్నవరపుష్పవితతు। లరుదారరాత్రులసగుపడుచుండ। గురుజవంబునబోయిగొనిరమ్ములీల। భానూదయంబైనబాగుగాదెన్న। పూనియంతకుమున్నెపౌసగనేతెంచి। కావుమమ్మెల్లకడుదూరమిటకు। పోవయ్యపోవయ్యభువనంబులందు। చారువిక్రమధైర్యశౌర్యపూర్ణుండ।వారయనినుబోలరవనిషేపీరు । లనిసన్నుతింపంగనంతసీతేశు।డనువుగాబల్కెహనుమంతుతోడ॥

భైరవిరాగము-అటతాళము-

హనుమంతనిన్నుప్రార్థనసేతునోయి। కనికరములరసన్నావగదోయి। వరమతిద్రోణపర్వతముదేవోయి।సరగునభ్రాతృభిక్షము

చెట్టవోయి ॥ ౧ ॥ నీవీకార్యముసేయనేతువుశీల। నీవిక్రమము
బల్కనేరనుచాల ॥ ౨ ॥ పదపడి నేడీయూపదదీచకవోయి। పద
లకనీమేలువచియింతునోయి ॥ ౩ ॥ తన్నులలోనొక్కతమ్ముడవీ
వు। రమ్ము వేగమె కౌగిలిమ్మికనీవు ॥ ౪ ॥ వరరంగపురమునవసియిం
చియున్న। పరముని నన్నికపాలింపుమన్న ॥ ౫ ॥

గీ ॥ యిట్లుబల్కినహనుమంతుడెగసియార్వ। లంకగంపించె
దిక్కులల్లాడెమిన్న। బగిలెజలధులుకలుషించెపర్వతములు। ధర
ణియనుచంచలమునొందెతత్క్షణమున ॥ ౬ ॥ ఆసమయంబున దే
వతలుపుష్పవృష్టి గురియించి రంబరంబున దుందుభి స్వనంబులు
మ్రోసెనంతటనాంజనేయుండాపన్నారణ్యుండగు రామచంద్రు
నింజూచి సవినయంబు నంగృతాంజలియై యిట్లనియె ॥

నవరోజు రాగము - అటతాళము -

యింతచింతయేల। దేవరవారి। కింతచింతయేల ॥ చింతసేయ
కుముదారాంతవిక్రముడన। సంతశౌర్యాంకహనుమంతుడనేగల్గ ॥
యింత॥ దీనభావమేల। ద్రోణాద్రి నిదెత్తు వేగలీల। పూని శైలా
నవభూతసమేతమై। గానబడెడు భూమినైన నే పెకళింతు ॥యిం
తచింత ॥ ౧ ॥ కరుణా బ్రోవవయ్య। నీబంటువిక్రమముజూడవ
య్య। కరమొప్పనీనామస్మరణబలంబున। పరిపంథిహరణమే పని
మైన యొనరింతు ॥యింతచింత ॥ ౨ ॥ తనువ్వ నీది సుమ్మి నీచరణాబ్జ
దాస్యయోగమిమ్మి। అనఘరంగేశ నాకనుమతి యొసగుము। జనితెత్తు
నావధాద్రి నినిమేషములోన ॥ ౩ ॥

భైరవి రాగము - ఆదితాళము -

ఇదిగో నెగరితిని। దేవరపదములదలచితిని। వదలక నదమలహృ
దయంబున నిను। ముదముసదలసగనెదురున్నదె భువి॥ దండిమగం
డనుచు। వేల్పులతండములనకొనుచు। నుండగనే నుద్దండబలము
న। నజాండంబైనను చెండాడంగల ॥ఇదిగో ॥ ౧ ॥ కదువతిజని
కాంచి। పర్వతముదుగకపెకళించి। తడబడకనుతలనిడుకొనివిహ
తులు। వడవడవడకుచునదలగవెదలెద ॥ ౨ ॥ సురవరనుతచరణ।

దుర్భరతరరాక్షసహరణ। హరవిధిముఖసురులుసరిబోలరు నీకును వ
రరంగస్థలవాసుడవరయఁగ ॥సిరిగోనాగరితిని ॥ ౩ ॥

వ ॥ ఇట్లు బల్కి రఘుపరేణ్యానకు ప్రదక్షిణనమస్కారంబులు
గావించి దీవనలొంది యుద్దేవుండు జగన్మోహన దివ్యమంగళస్వరూ
పంబు నిజహృదయాబ్జంబున నిల్పుకొని వానరకోటులచ్చెరువొం
దిచూచుచుండ దేవతలానీకసంఘము జయజయధ్వానంబులు గావిం
వింపనొప్పునప్పుడు పుష్పించి యంబరంబునకెగసి పోవుచుండెన
ట్టియెడ ॥ సీ ॥ హనుమంతుడేగుటవినిదశగ్రీవుండు కార్యవిఘ్న
మొనర్పంగరిమెదలచి। కాలనేమినిబంపకడువడిజనివాడుమార్గ
మధ్యంబున మౌనియగుచు। మాయామయాశ్రమమధ్యభాగంబు
న తాపసోత్తమురీతి తపముసేయ। నచటికేపవనజుండరుదెంచియా
దైత్యు। కపటకృత్యంబెల్ల నపుడెరింగి। మకరిభంజించియచ్చరమ
గువ బ్రోచి। పటుపరాక్రమమలరనప్పావనుజు। నుగ్రగతిడా
సిపోరాడియుర్విగూల్చి। శీఘ్రముననేగెవానరసింహుడంత॥

వ ॥ ఇవ్విధంబున నంబోయిపోయి కుశద్వీపంబుదాటి క్షీరసము
ద్రంబుగడచియుత్తరభాగంబుననొప్పుచంద్రద్రోణగిరులం
గాంచి ద్రోణశైలంబుమీదికెంజని మహౌషధాన్వేషణంబు
సేయఁదొణంగిన నద్దివ్యౌషధులదృశ్యంబునొందెఁ. కనుపడకున్నన
ప్పర్వతేంద్రుతోనిట్లనియె ॥

కందార్థము.

గిరివరరఘువరుడనుపగ। గురుజవమునవచ్చినాడగురుతుగ నా
కుం। నిరుపమదివ్యౌషధులిక। కరుణనుగనుపరచివేగగావుము। రా
మానుజుని బ్రోవుము ॥ తరుచుగనినుమదిదలచెదనాకిపు। డరుదుగ
నౌషధులన్నియొసంగి ॥ గావుము ॥ వ ॥ అనినయాశైలేంద్రుం
డు దుర్వారగర్వాతిరేకంబున బలుకకుండిన ॥

చ॥ అనుపమరౌద్రముప్పొదలనద్రివరుంగనిదుష్టబుద్ధితో । ననుపుగ
బల్కవైతివిరయంబుననిన్నువకళించిలీలతో । ఘనతరపుష్పకందుక
ముకైవడినెత్తుకరామునిపాలికిం।జనియెలిపింతునన్నెలువశత్రుడువచ్చి
నగానిదుర్మతీ ॥ గీ ॥ అనుచుతనవాలముననద్రినట్టెజుట్టి। బలిమి

పెకళింపనబ్బులుకలఁగెధరణి। యొరిగెసురదంతులటుత్రికూటాగ్రగిరులు
గదలెనహీనకులేంద్రుఁడువంగెనయ్యవసరమున ॥

వ ॥ అంత సమ్మోహాధరంబుదాల్చి సింహనాదంబుచేసిన ప్రళ
యాగ్నికల్పులగు చిత్రసేనాదిగంధర్వకోట్లవీరునిదాఁకినొప్పించిన
నుగ్రుండై వాలంబునఁగొందరింజుట్టి నేలంగొట్టియు కొందరింబి
డికిటఁబోట్లవధించియు కొందరి దరుపాషాణంబుల భంజించియు
నిర్విఘ్నంబునం జీకాకు పరచి పలాయనంబు గావించి గగనమా
ర్గంబునం జనుదెంచుచున్నసమయంబున ॥ ద్వి ॥ హనుమంతు
డీరీతిఁ జరుదెంచుచుండ। మొనసినందిగ్రామమున నొప్పుభరతు। డా
రాత్రిమునస్వప్నమురుసుగాబడసి। శ్రీరఘుపతిబాల్సీతయుసడసి।
కరుడుగాఁజనినిండగావచ్చె సింగము। సమయమున స్వప్నఫలచరితంబు
తెలియు। దమలాత్మలగుచు నేయుమవినున్నారో। నావాకియాపద
సనుకూరునాకో। కామినీమణిలోకైకసతిసీత। యేమాయ
నోరాఘవేంద్రునితమ్ము। డేమికష్టముతోడనేదున్నవాడో। తె
లియదాయనటంచు సీనత్వమొంది। వలనొప్పబ్రాహ్మణవర్గం
బులకును। కలదానములుజేసిఘనజపహోమ। శాంతులుగావిం
చిసారెకుమదిని। చింతనొందుచునుండ శ్రీహనుమంతు। డాసమ
యంబునసంబరవీధి। ఘాసిల్లుచునువచ్చె భరతునిజూచి। రాముబో
లినయట్టిరాజర్షియనుచు। వేమరుమదిలోనవిస్మయంబొందె। భ
రతుడవ్వీరునిపదపడిజూచి। వరఘాతమిదిపనివధియింతుననుచు।
శరముకార్ముకమునసంధింపగాంచి। వరమతినశరీరవాణి యిట్లని
యె ॥ క ॥ వినుమీతఁడాత్మబంధుఁడు। ఘనశరమేయంగదగదు కా
వుమనగ। సయ్యనకులుడుకోపముడిగెను। చనెవాయుతనూజుడం
తజవములరంగ ॥ గీ ॥ రావణుండుబనురయమునమాల్య। సత్ప్రి
ముఖయాతుధానబలముల్లెల్ల। నాంజనేయుతోడనద్ధిపైపోరాడి।
విఫలులైరియతనివిక్రమమున ॥ వ ॥ అంతరఘువరుండు దివ్యౌ
షధపర్వతధరుండగు। హనుమంతునిప్రభాపుంజంబర్థుణోదయం
బనితలంచి। శోకంబుప్పతిల్లలక్ష్మణుంగాంచి॥

ఉదయరాగము-ఆదితాళము.

ప్రకటముగ నరుణోదయప్రభ। పరగ తూర్పున ననమరె నికనె ॥ నకట తమ్ముడ నిన్నుబాసితి నవనియందు । సుకరమగు నీముద్దుమొగ మికచూడక రుపుగదన్న । సీవించుకకనుంగవదెరచి చూచిన సుఖము గాంతు ॥ ౧ ॥ చెలగి వనములనఖిల సేవలు సలుపుచును రెండవభుజంబన। వెలసియిటు ననుడించిచనుటిది విహితమగునె। పలుకుమొకపరి వెంటవచ్చెదనని లుకలేటికి నిలువనిచటను। నలినమిత్రునకెంతపగతుడనైతి తండ్రి ॥ ౨ ॥ వనమునకు నను నమ్మి నిను బనిచిన సుమిత్రకు నేమిజెప్పుదు । ఘనమతి నిభరతునకు శత్రుఘ్నునకు నేమందు ॥ ధనువు శరములు గొని మహోగ్రతర నుజవరులను గదిసి తునిమిన । నినుధరంగోల్పోతి శ్రీరంగనిలయుడసయ్యయ్యా ॥ ౩ ॥

గీ ॥ శరణుబొందిన యావిభీషణునకేను । పట్టముసరంగగట్టితి పరగమున్నె । శరణిన దిప్పు నేమందు నైవగతికి। సత్యహీనుడనై తిబోజగతియందు ॥ క ॥ వనచరసేనలతోడను । జనుమికకిష్కింధకీవు సరగుననాకై । వనరాశిగట్టి దనుజుల। ననిమితిమవలీలనతులదోర్దర్పమునన్ ॥ గీ ॥ అనిన సుగ్రీవుడారాముని నట్టుజూచి । మానవేశ్వర శోకంబు మానుమిపుడు। సరగుననుజోచ్చెనాలవరఘాముపవన। తనయుడికశీఘ్రమునవచ్చు తడయకతడు ॥

వ ॥ ఇట్లు బల్కిన యనంతరంబున దివ్యౌషధశైలంబుతోడ ధగద్ధగితప్రభాభాసురుండై చనుదెంచు హనుమంతుం గని మార్తాండుండరుదెంచెనని శంకించి ప్రళయసమయమహోదగ్రవిగ్రహుండగుభర్గుచందంబున రౌద్రరసోల్లసితమూర్తియై సుమిత్రాపుత్రరక్షణార్థంబునకై మహౌషధాద్రికెంజనిన హనుమంతుండరుదేరకమున్నె మార్తాండుండుదయించుచున్నవాడు మదియ్యాదివ్యాస్త్రంబున వీనింద్రుంచి లోకంబరాక్షసంబుగావింతునని మహోద్దండంబునంభ్రుకుటీస్ఫూర్జితనిటలుండై కోదండంబుగొని రౌద్రాస్త్రంబుసంధించినంజూచి జాంబవత్సుగ్రీవవిభీషణప్రముఖులతిభయంబునం దత్తరపడి వినయంబున హస్తంబులు ముకుళించి మహాప్రభో నీవు రౌద్రాస్త్రంబుసంధిం

చుటవలన నఖిలసురగరుడోరగ గంధర్వ సిద్ధసాధ్య ప్రముఖనివ హంబులు దిక్కుల కుంచారుచున్నవారు గిరికాననసముద్ర ద్వీప సహితంబగు ధరామండలంబు గ్రక్కునంగదలుచున్నయది యెక్కరికై భువనత్రయసంహారంబు సేయనేలగరుణింపు మతండు సూర్యుండుగాడు దివ్యౌషధనగధరుండగు హనుమంతుండు సూర్యునిచందంబునవచ్చుచున్నవాడనిపల్కునసమయంబునమహీమండలంబునకరుదెంచినభానుండునుంబోలెపవనసందనుండరుదెంచి పర్వతంబుడించి రఘువరునకిట్లనియె ॥ సీ ॥ శ్రీకరరఘుకులక్షీరాబ్ధిచంద్రమవలనొప్పనీయాజ్ఞ తలధరించి। సుసలకపోవంగమార్గమధ్యంబునగలిగెననేకవిఘ్నములునాకు। గరిమెనీనామసంస్మరణచేనవియెల్లభంజించి ద్రోణాఖ్యపర్వతంబు। జవమునజేరియాశైలేంద్రమునమోషధులుగానలేకటో బలిమువలన। కొండగొనివేగగంధర్వకోట్లగెలిచి। వచ్చుచున్ననిశాచరవర్గమవార్ధి। మధ్యమునదాకసవలీలమడియజేసి। గట్టెజేర్చితినిప్పుడ్నగావపలయు ॥

వ ॥ అనినరఘువరుండిట్లనియె ॥

మెదుకులకాంభోజిరాగము - ఆదితాళము -

హనుమంతనీవనుపమపుణ్యాత్ముడవోయి। మాకుజ్ఞుసమతి ప్రాణములిచ్చిగాచితివోయి॥ అతులప్రసప్రాప్సహాయుడవునీవు। నీకుజతతేరుభువనములకగుణాంమతిచాటుపిక ॥ ౧ ॥ శ్రీరఘువంశముద్ధరణజేసినాడవు। నీవు। శూరరాకుసులసదనిగుప్పనాడవు ॥ ౨ ॥ యెలమితోనీయుపకారఫలమిమనంచునను। రంగనిలయుమునసినన్నమదినిదలచుచునుందు ॥ ౩ ॥ వ ॥ యిట్లానతిచ్చిన యనంతరంబున సుషేణుండుసుగ్రీవానుమతంబున నస్మహాపర్వతంబు మీదికింబోయి విశల్యకరణింగైకొనివచ్చుచుంబునంజనుపొంచిలక్ష్మణునకుపయోగంబుగావించిన నిశ్వీరుండు సుఖనిద్రితుండైమేల్కాన్నచందంబునచయ్యనలేచిరఘువరునకునమస్కరించినస్మహానుభావుండతని గాఢాలింగనంబు సలిపి మూర్ధాఘ్రాణంబుజేసి పరమానందంబునసుషేణుంగొనియాడెనంతహనుమత్సుగ్రీవవిభీషణజాంబవత్ప్రముఖులత్యంతసంతోషంబునం గంతులైచిరి తక్కునక

పులుకిలకిలాశబ్దంబులదిశలుపూరింపంజేసిరి గగనంబున దేవతలు
పుష్పవృష్టిగురియించిరి దుందుభిధ్వానంబులొనర్చిరంత నాంజ
నేయుండురామాజ్ఞవలనద్రోణాచలంబుగొని యథాస్థానంబు
నంజేర్చి క్రమ్మరంజనుదెంచి నట్టియెడ ॥

సీ ॥ తమ్మునిజూచిసీతానాథుడనుసుమిత్రాత్మజనీవుఘోరాహ
వమున । రావణుశక్తిచేరయమునధరత్రావ్రాలియున్ననేనొందితిను
గ్రదుఃఖ । మీవులేకున్ననాకేమిటికిదేహమేటికిసౌఖ్యంబులేలసీత ।
యనిబల్కలక్ష్మణుండారఘుగ్రామణిగని నీపదాబ్జముల్ గాంచు
వారి । కనఘభయమేమినమ్మినయావిభీషణాఖ్యబ్రోవంగవలదెనీ
వసురపతిని । జంపుమవలీలయాతండుజచ్చియున్న । తలలుజూడం
గవేడుకగలిగెనాకు ॥ ద్వి ॥ అంతటలంకేసుడరులగెల్చుటకు । చిం
తించిశుక్రునిసేవించిధైర్య । మునహొక్కహోమంబుమొనసిచే
యంగ । మనమునదలచిసన్మతితోడఘోర । పాతాళతుల్యమైభాసి
ల్లుగుహకు । ఖ్యాతిగానసురులకావలిబెట్టి । వలనొప్పలోపల వసి
యించియస్త్ర । పరిధలంచితబిల్వభల్లాతకాది । వరసముచ్ఛయ
ములువరుసగాగూర్చి । కొమరొప్పదధిమధుఘృతరక్తమద్య । మ
మితంబుగాపాత్రలందుండజేసి । కాకకుక్కుటగృధ్రకంకసేనము
ల । వీకతోదెప్పించివిమలమానిష్ఠ । నసలసన్నిధినుండియవివేల్చు
చుండ । హోమాగ్నులనుధూమముద్ధతివెడలి । భీమంబుగానింగి
బెలుచనుండంగ । కనివిభీషణుడుశ్రీకాకుస్థుగాంచి । వినయమొల
ర్పంగవెనసిట్టులనియె । నినుగెల్వనేరకనిర్జరారాతి । పనిబడిభా
ర్గవుబ్రార్థించియతని । యనుమతిగొనిహోమమనూరూఢిసేయ
మొనరనిండెనుధూమముర్వియుదివియు । యిదివిఘ్నమొనరింపనిపు
డెకర్తవ్య । మదిపూర్ణమైనచోనతడజేయ్యుడు । కావునపవన
జాంగదముఖ్యకపుల । వేవేగబనుపుమువిఘ్నంబొనర్ప ॥

చ ॥ అనవినిరాఘవుండుపవనాత్మతనూజునివాలినందనాద్యను
పమ । విక్రమాన్వితులనచ్చటికంపగవారుదగ్రులై । జనిచనిలంక
జొచ్చిదనుజప్రకరంబులనుగ్రగూల్చుచుం । కనకకవాటముల్విరుగ
గ్రుక్కనదన్నుచునుబ్బియార్చుచును ॥

వ॥ ఇవ్విధంబున హనుమదాంగద మైందద్వివిధశరభపనసగజ గవయ గవాక్షనలనీలశతవలిప్రముఖ వానరకోట్లుప్పరంబుననల్ల డలందిరుగుచు దవ్వారికులం జంపుచు రథంబులు నేలం ద్రిప్పివై చుచు ఘోటకంబులమదిఁ ఁవుచు మాతంగంబులమడియంజేయు చు నాయుధంబులువిరిచివైచుచు భాండాగారంబులుసొచ్చి ధనం బులుపారంజల్లుచుగనుపడినదైత్యవీరులంబట్టుకొని రావణుంజూ పుమని కఠినంబులగుబిడికెటిపోట్లం బొడుచుచు నివ్విధంబున విహ రింప విభీషణపత్నియగుసరమచనుదెంచికరసంజ్ఞవలనరావణుం డున్న ప్రదేశంబుకనుపరచిన వానరవీరులచ్చోటికిజొచ్చి పోయి రావణుంగాంచి హేమాద్రవ్యాదులగ్నిగుండంబునంవైచియద్ద శకంతునిం గోరువులంగాల్చియు నఖంబులంజీరియు దంతంబులగ రచియు ననేకవిధంబులంబిడయొనచిఁన పర్వతంబునుం బోలె ని శ్చలుండై యున్నసమయంబున యంగదుండంతఃపురంబునకరిగి దురంతచింతాక్రాంతయై కరతలంబు చెక్కిటంబెట్టుకొని రామ లక్ష్మణులవిక్రమవృత్తాంతంబుతోడిచేడి యలకుముచ్చటలొప్పం జెప్పుచున్న మండోదరింగాంచిసింహంబుకరింబోదివిన చందంబు నం గదిసిశిరోరుహంబులు కేలంబట్టుకొని రాక్షసేంద్రునిసమీపం బునకుంగొనిపోయియిట్లనియె॥

శంకరాభరణరాగము. అటతాళము.

ఇదిగోతెచ్చితిచూడర। నీదేవినిం। పొదవచెచ్చెరబ్రోవర॥ యి దిగోతెచ్చితిరదుమఁ దచిత్తనీముద్దు। సుదతినినిజఁ రసుదతులుత్స వమొంద ॥ఇదు॥ ఘోరతరాటవిని। వంచనజేసిశ్రీరామప్రభుస తిని। చోరవృత్తిహరించితారీతిగాదునీ। వారెల్ల చూడదుర్వారవి క్రమమొప్ప ॥ ఇదుగొ ॥ ౧ ॥ ధ్యాననిష్ఠులమానర। శ్రీరాము బాణానలమునగూలర। మానులనలయించిమగువలచెరనుంచి ఘూనినీవరిగినషోకలనుభవింప ॥ఇదుగొ ॥ ౨ ॥ మానసత్వమికచా లుర। నీక్రొవ్వెల్ల మాన్పకపోబోమురా।మానితశ్రీరంగమందిరపతి యగుభానుకులేంద్రునిపదపద్మస్మరణచే॥ఇదుగొ ॥ ౩ ॥

కొట్టడుటాత్మనెరుంగ। వతడుజగన్మోహుండాదివిష్ణుండు। నతత చిదానందశాశ్వతమూర్తిగా। గావునవిజయంబుగైకొనునతడు। నీ పురణంబుననెరి గూలగాంచి। పావకశిఖలలోబడనుంకుగూడ। దదియెట్టులన్ననాకధిపమాత్రం డ్రి। ముదిమియుమరణంబుమును కొనిలేక। వెలయుచుండెనజానవపంబునగ। చలమేలమునకింక సౌఖ్యంబులేల।వలనొప్పయి...హితోడ। జలజాక్షుడగు రామచంద్రునకొసగి। ...మునివృత్తివాసంబుజేసి। ఘననిష్ఠ తపములుగావింతమింక ॥ వ ॥ అనిపల్కిన వింశతిబాహుండు మండోదరితోనిట్లనియె ॥ క ॥ హరిరాఘవేంద్రుడనుచును। సిరిజ నకతనూజయనుచు। చిత్తములోనం। గురుతెరిగియురఘుపతిచే। నరుదుగమృతిగోరితెచ్చితవనితనూజ ॥

సీ ॥ పరకాంతలనుబట్టిచెరబెట్టవాకృష్వానిదోషంబులు పూని చేసి। గరుడగంధర్వచరకోట్లబాధించిపాటగాములను గీటడంచి। మునినైతినని దొడ్డవసమునకిపుడేగనతివిరోతగునెసదయు గాక। నింద్రజిత్ప్రముఖులనెల్లముందుగజంపిజంపించిజీవింపజను నెఘోర। సమరమొనరించిరాఘవుసంహరింతు। సంహరింపగమ డిసినసరసిజాక్షు। చానివతిగాంచువహ్నిని భాతితెరువు। విడిచినిలిచిన లతికైకైవడినిల్చివు। శుభవిహీనకైనొప్పను సుందరాంగి ॥

వ ॥ ఇట్లుపల్కి మండోదరింవిటొట్టని మహోగ్ర కోపరుం డై సభాస్థానంబు ప్రవేశించి॥

నాటరాగము-జంపెతాళము.

ప్రస్థానభేరిమ్రోయించెగా। దేవతలుస్వస్థానములుమానిచం చలమునొందగా। ఆస్థానమంటపమునందురావణుడుధైర్య స్థైర్య మునమించిరణరంగమునకేగ ॥ ప్ర ॥ జలరాసులెల్లఘూర్ణిల్లగా। వలనొప్పరంగపురసిలయునివదించునిచలమునమహోగ్రబలశౌ ర్యసంపన్నుడై ॥

మధ్యమావతిరాగము-అటతాళము.

అగ్రహారసపూర్ణవిగ్రహుడగుదశగ్రీవుడువెడలెగా ॥ సుగ్రీ వప్రముఖులసూర్యవంశజులనత్యుగ్రాహవంబుననిగ్రహింతు న

తురచు ॥నాగ్రహ॥ ఘనతరమైకోటిద్వయఘంటికాఘణంఘణరవప్రకటితమై। మొనసిషోడశచక్రములుసహస్రాశ్వములనువొందురథముచయ్యననెక్కియాచుఁచు ॥నాగ్రహ॥ ధళధళమెరయురత్నకిరీటములుపదితలలందుబెంపారగ। సలలితకుండలాంగదహారభూషణావళులొప్ప శ్రీరంగనిలయుమాకోఁనువేటక్రి॥ నాగ్రహ ॥ వ ॥ ఇట్లుదశకంఠుం డకుంఠితవైభవంబున రాహుమస్తకధ్వజత్రయ శోభితంబగుమహారథంబమితోత్సాహంబుననెక్కి చంద్రహాసతోమర పరిఘ పట్టిస ప్రాస శూల ముద్గర భిండివాల బాణ బాణాసన ప్రముఖంబులుదాల్చి కాలకేతుండనుసూతుండు రథంబుగడప ఖడ్గరోమ ఖరరోమ వృశ్చికరోమాగ్నివనుఁడలను మహావీరులుగ్రమనస్కులై సాహాయ్యంబుగా వెనువెంటఁజనుదేర చతురంగసైన్యసమేతుండై ఘనజాగ్రక్కదలం జనుదెంచి యవ్వానరానీకంబులం దాకి నయ్యిరుబలంబులకు పోరు ఘోరంబయ్యె నట్టియెడ ఖడ్గరోముండువిజృంభించివానరుల వధింపంబూనిన నాంజనేయుండు వానితోఁ డంగొంతదడవు కయ్యంబుగావించిగిటడంచె నాసమయంబున వాలిపుత్త్రుండు ఖరరోముని కాలు ప్రోలికింబంచె నీలుండుదగ్రుండై వృశ్చికరోమునవనింబడవైచెనట్టియెడ ॥ గీ ॥ అగ్నివనుఁడంతనాగ్రహంబున। విలయాగ్నిసదృశుడగుచు । నరుగుదెంచిరాముమీదబాణరాసులుబరగింప। వారుణాస్త్రమునసనువానిద్రుంచె ॥ క ॥ కనుగొనిరావణుడుద్య। ద్ఘనతరవిలయాంకురుఁబోలి కాకుత్స్థకులేంద్రుని । సామీప్యమునకువడితనయరదముఁబోవఁజేసితగనిట్లనియెఁ ॥

ద్వి ॥ వినుమురాఘవదైత్యవితతులనవని। దునిమితిననిచాలత్రుళ్లెదవీవు। నీనిక్కులణగంగనిప్పుడేగూల్చి। పూనినిజఁరకోట్లభువివణకింతు। నరభోజనుడనేనునరుడవునీవు। సరిలేనివాడరాతుసకులేశుండు। సురపతిప్రముఖులస్సుక్కించిగెలిచి। ధరణికైలాసభూధరమెత్తినాడు। పరగమద్భుజశౌర్యపటుదర్పములకు । వెరచిపారుదురెట్టివీరులియ్యెలను। నీవరణ్యంబుననివసింపలేక। చావవచ్చి

ధణిదశవదనువధింపగ । పదపడిదేవ ప్రభుడనుపగనె ॥నిదిగో॥
౧ ॥ సురనుతదనుజవిరామ। నీరధచోదకుడను శ్రీరామ । వరకృ
పనీరధవరమికనెక్కుము। ధరణినిలువదగదరమహాశాయకు ॥మిది
గో ॥ ౨ ॥ నిరుపమ శ్రీరంగేశ। ననుకరుణింపుముభవనాశ। సుర
వినుతునిభీకరమగుశిరముల। బోరిగోసదగదుర్భరతరశరముల॥
నిదిగో ॥ ౩ ॥ సీ ॥ అనపినిరఘురాముడాతేరునకుచుట్టుదిరిగి మ్రొ
క్కియుపెహాగ్ర తేజసులర । భానుండుపూర్వాద్రిపైవెలుంగెడు
మాడ్కినవలీలదివ్యటరదమెక్కి । భాసిల్లెవాసరప్రకరముత్సవ
మొందనతులవిమానస్థులగుచు నవ్వ । సురకిన్నరోరగగరుడగంధ
ర్వాదులమ్మహాయుద్ధంబుసమరజూడ । వచ్చిదివినిల్చిచూడంగవన
ధిపనధి। కరిపెరియునద్రియున్ద్రియుహరియుహరియు । గదసితాకి
నక్రైపడిగదసితాకె। పడినబోరంబరామరావణులుచెలగి॥

బిలహరిరాగము-అటతాళము-

యిరువురుబోరిరిసమరైై । ఘోరతరసింహనాదభీషణులై । క
రమొప్పదోనలనుకరములసాచుట। శరములుగోనుటదుర్భరకా
ర్ముకములను। నెరిసంధించుటలుభీకరగతినేయుట। లరుదుగజరికిం
పనలవిగానట్లుగ ॥నిరు॥ రామనినిక్రంతునంచు । వోరావణ
ప్లకటించు। వేమారునుక్కుచుపెనగర్వములనుహోరా । ద్రామ
గతినిబాణతతులేనినల్లడ। నేమిగప్పడకుండనెలమిచీకట్లగ।రామ
రావణులుసంరంభద్విడ్ఘోరమీర ॥నిరు ॥ ౨ ॥ రొయకరినొకరుహు
ష్మటంచు। నలికి । ప్రకరములను విదళించు । ప్రకటాస్త్రములు
సమంత్రకపూర్వమగకార్ముకవిద్యనెరయస్పృక్కినేయగనుదే
వ। నికరము శ్రీరంగనిలయుజయముగోర। సకలరాక్షసులురాక్ష
సపతిమెల్గోర ॥నిరువురు ॥ ౩ ॥ వ ॥ ఆసమయంబునరాక్షసేశ్వ
రుండు గాంధర్వదైవతాస్త్రంబులు ప్రయోగించి భరాతాగ్ర
జుండు మరలంగాంధర్వదైవతాస్త్రంబువలనంభగ్నంబుగావి
చె నింద్రజిజ్జనకుండునాగాస్త్రంబు ప్రయోగించిన నైధిలినాయ
కుండు గరుడాస్త్రంబువలనంజక్కడె నంత రావణుండత్యంత
క్రోధావేశంబున రామభద్రునిసహస్ర బాణంబుల నొం

మాతలిశరీరంబనేకబాణంబులం గ్రుచ్చియొక్కవిశిఖంబుననింద్ర
ధ్వజంబుబడవైచి బలుతూపులఘోటకంబుల మర్దించిన సురగ
రుడోరగ గంధర్వమహర్షిసంఘంబులాహాకారంబులెసగ రావ
ణరాహుగ్రస్తుండై శరసంధానంబు సేయ నలవిగాక యున్న
రామచంద్రు నిందర్శించి మహావ్యసనంబునొంది రట్టియెడ ననే
కమహోత్పాతంబులుగల్గె రాఘవేంద్రుండత్తరి కోపోద్రేకంబు
నంజూచినంలోకంబులుఘూర్ణిల్లెనంత ॥ శా ॥ శూలంబొక్కటి
దానవాగ్రణిమహాశూరత్వమొప్పారగా। కేలందాల్చిరఘుప్రవీ
రుగని నిర్క్రీడాగతిన్వైగ। నియ్యాలంబుందువధింతుచూడుమని గ
ర్వారూఢుడై వ్రేసినం। కాలాగ్ని ప్రభలుప్పతిల్ల దడరంకాకుస్థు
డుగ్రాత్ముడై ॥ క ॥ శరతతులేసినశూలం। బరుదుగనవిద్రుంచె
రాముడంతట। త్రిదశేశ్వరుడంపినశక్తిన్వడిబరపి మహాశూలము
పుడుభగ్నముజేశెన్ ॥ గీ ॥ సమరలరాఘవుండుహరులనుస్రుక్కిం
చి। యురముఫాలముగ్రశరములేసి। రావణాంగమెల్లరయమున
బహురక్తధారలొలుక సేయుదైన్యమొందె॥ వ ॥ అంత ॥

నాటరాగము- ఆదితాళము-

రామరావణులుపోరిరిఘనసంగ్రామభీములగుచున్। భీమనినద
ములబిలచుచుబాణస్తోమములందందంధుమికింపుచు ॥ ౧ ॥ తొలగ
కకలగకబలుపిడుగులవలెసలరుశరంబులువ్రేసి। నెత్తురులొలుక
వ్రణంబులుజేసి। హుమ్మనిచెలగిరయమ్మునడాసి।మించుచు॥ రా ॥
౨ ॥ గరిమతోడనిరువురు ప్రళయార్కులగతినిదురంబున మించి ధై
ర్యస్ఫురణమనంబులనుంచి। సూతులవరతురగంబులనొంచి। మా
కొనని ॥ రామ ॥ ౩ ॥ సరగునరంగస్థలవరదశముఖులిరువురుశౌ
ర్యములొప్పన్। దుర్భరతరరోషములుదలిర్పన్। విశిఖములురు
వడిదివిభువిగప్పన్।మెరయుచు ॥ రామరావణులుపోరిరి॥౪॥

వ ॥ అంతట రావణుండు సంవర్తాగ్నియుంబోలె మండు
చు మేఘంబుతో యధారల వలనందటూకంబు నిండింపం జేసిన
చందంబునరాఘవేంద్రుసిమేఘశ్యామసుందరంబగుశరీరంబు బా
ణవర్షంబున ముంచిన॥

మహాస్రగ్ధర.

చటులోగ్రాకారుఁడై భాస్కరకులుఁడు ధనుజ్యారవస్ఫూర్తిఁ మీరన్। పటుబాణాగ్నిస్ఫులింగప్రకరము దివిఁ గప్పన్। వడిం బోర। నత్యుత్కటరోషస్వాంతుఁడయ్యద్దశముఖుఁ డతిదుర్దాంతదర్పంబుతోనా। భటులొప్పన్ రాఘవేంద్రున్ బహుశరముల దుర్భావుఁడై గాఢ నేసెన్ ॥ చ ॥ తన విలువిద్య నేర్పుఁ గని తద్దయు దేవత లుత్సహింప। చయ్యన రఘువంశనాథుఁడు రయంబున తీవ్రశిలీముఖంబులన్। దనుజకులేంద్రు దేహము యుదగ్రగతింతగ నాట నేసి। మోమున చిరునవ్వు మొల్వ। రఘుముఖ్యుఁడు రావణుతోడ నిట్లనెను ॥

నీలాంబరిరాగము - అటతాళము -

ఖలుఁడ నీయుపకారఫలము దలంచిన। కడు శ్లాఘనీయ్యము రా। పలనొప్పు జనకనందనను నీ వడవిని। తలకక వంచించి చెలఁగి కొంపోయిన ॥ ఖ ॥ ౧ ॥ వనమున నను సౌమిత్రిని వేరుండఁగఁ గాంచి। వనితను హరియించియు। ఘనమతి శూరుఁడనని విర్రవీఁగెదు। మనసున లజ్జింపక నుఁ గావించినయట్టి ॥ ఖ ॥ ౨ ॥ గరిత సన్నిధినే నుగల వేళ నరుదెంచి హరియింపఁగ దశిసను। వరరంగనగరనివాసదేవుఁడనైతె। ఖరదూషణాదులఁ గలయఁ బంపనే నిన్ను ॥ఖలు॥ ౩ ॥ ద్వి ॥ కటకటా మును నీవు గావించినట్టి। పటుపాపవితతు లేపాఁడ నెన్నఁదరమె। గరుడకిన్నరదేవగంధర్వనాగ। తరుణుల వడిఁ బట్టి తగఁ జెరఁబెట్టి। సురగణంబుల గొట్టి సుమనస్కులైన। వరమునిప్రవరుల వడి డాసి చంపి। పరగ లోకము లిట్లు బాధించినావు। ధరణిలో జీవింపఁ దగ దింక నిన్ను ధరఁ గూల్పను దగ్గండదర్పంబు వెలయ। శరశరాసనములు చక్కఁగాఁ దాల్చి। కదసి యున్నాఁడ నికామాంధకార। మదమచ్చరోగ్రముల్ మహిని దహింప। వినరోరి మచ్చింత పెసధనుర్ముక్త। ఘనతీవ్రబాణముల్ కడు వడిఁ బరపి। వీకతో దుత నెల్ల వేల్పు లుప్పొంగ। నీ కంఠబాహులు నేఁడు ఖండింతు। భువిఁ బడ్డ నిను జేరి పొసఁగ గృధ్రాదు। లవలీల భక్షించు నమితమాంసంబు ॥ వ ॥ ఇట్లు మహోగ్రవిగ్రహుండై చండబాణంబులు రాక్షసేంద్రు మీఁదఁ గుప్పించె నంతట రాఘవేంద్రస్వాధీనంబులగు సమస్తశస్త్రాస్త్రంబులు నిజస్వరూపంబులతో

దృశ్యంబులై రఘువరునిహృదయంబుసంతోషంబుగావించెయుగ జనితంబులైనశుభనిమిత్తంబులుగానంబడియె నంతట తాటకాంతకుండు దేదీప్యమానుండై సంరంభించి మహాబాణవర్షంబునంజేకాకు పరచిన రావణుండుచేయునదిలేకయూరకున్ననయ్యెడసూతుండెరింగిరథంబుకించద్దూరంబుదొలంగంగొనిపోయిన నంగోపించిరావణుండుసూతునకిట్లనియె॥

నీలాంబరిరాగము. ఆదితాళము.

ఏలతొలగించితివిరథము। నీవిట్టు। డింతనీచముసేయనేటు లోకేమనను। చాలగసుహృదయములశాత్రవులుముదమొంద॥ ఏలా॥ పరబలంబులుగనిహసింపా। ధరణిలోస్థిరమైనమత్కీర్తి చెచ్చెరనసింప। పరహితముదలచినీకరబుద్ధిశక్తివలె। వెరపెరుంగనినేనువెరవుజెందితినయిట్లు॥ ఏలా॥ యరదముకదొలగింపుమనుచు। శ్రీరంగపురినెలయుతోడనేబోరలేననుచు। గరిమెనీతోడనకర్కరగన్నయుంటినా। [illegible] చూడ॥ ఏలా॥ ౧॥ తనసారధినిగాంచిదశముఖుండిట్లు। ఘనతరకఠినవాక్యములాడనాల। [illegible] ఫణిబడికోపించిభాషించుమాట్కి। [illegible] చాల। మొగసనీకపచారములు [illegible] ప। పూనియున్నదిలేదు [illegible] తుండగాను। [illegible] నిమూర్ఛుండగాను। [illegible] తినిగానిదోషంబులేదు। [illegible] నతిముదమొందిహస్తాభరణంబు। పిలచిసూతునకై పెట్టెనొసంగె॥

గీ॥ రావణాజ్ఞవలసరయుమునసూతుండు। రథముదగ్రగతిని రఘుకులాబ్ధి। చంద్రుడైనరామచంద్రునిసన్నిధానమున కెలని దోలెనమరులడల॥ వ॥ ఆసమయంబున యుద్ధపరిశ్రాంతుండై యున్న రామచంద్రునికడకుందేవతులతోడ నగస్త్యమునివరుండరుదెంచి రామచంద్రా సనాతనంబైగుహ్యంబగు శ్రీమదాదిత్యహృదయంబుపదేశంబుగావించెద దానివలనం శత్రుసంహార

ప్రముఖంబులు సిద్ధించు ననిపలికి క్రమంబున నుపదేశంబుగావిం
చి దేవతులతోడ యథాస్థానంబునకుంజనియె నంతట రఘువరుం
డు మూఁడుమారులాచమనంబుగావించి జపించి మహోత్సా
హంబున నొప్పుచున్నయెడ సూర్యుండు సీతావల్లభునిం దర్శించి
రావణసంక్షయవిధంబెఱింగించి త్వరసేయందగునని పల్కె నంత॥

సీ॥ కదిసి దశాస్యుండు ఘనదీప్తబాణముల్ కడిమి రాఘవుమేనఁ గ్రా
డ నేయ। సత్యవ్యగ్రుఁడై రాముఁడు సురేంద్రసన్నద్ధచాప ముద్ధతి
దాల్చి చటులబాణ। తతులు రావణుమీఁద నతిజవంబున నేయ సరకు
సేయక రాక్షసప్రభుండు। బహుచండకాండముల్ బరగింప రా
వణధ్వజ మొక్కశరమున డుల్చె మొప్ప। ధరణిఁబడనేసె రఘునాథుఁ
డరులు బెదర। సంతసంబున శ్రీరాఘవాశ్వములను। చాలనొప్పిం
చ రావణాశ్వముల మరల। ముంచి నొప్పించె రఘువర్యుఁ డంచితముగ॥

వ॥ ఇట్లన్యోన్యపరుషరుధిరగతింగలిగి ప్రళయసమయరుద్రు
లవిధంబున కులశైలంబులలాగున నగనువడి యన్యోన్యజయకాంక్షు
లై శతసహస్రసంఖ్యలం గల శరవర్షంబు లొక్కుమ్మడిఁ గురిపిం
చుచు రోషతామ్రనేత్రులై మర్మంబులు నొప్పించుచు సారథుల
నలయించుచు సింహనాదంబు లొనరించుచు రక్తసిక్తాంగులై సం
గ్రామంబు సేయ నెడ గగనంబునకు గగనంబును సముద్రంబునకు
సముద్రంబును తుల్యంబైనతెఱంగున రామరావణయుద్ధంబునకు
రామరావణులయుద్ధంబె తుల్యంబుగాని మఱియొండు గానేరదని దే
వగంధర్వప్రముఖులు దలంచుచుండ నమ్మహాయుద్ధంబు సకల లో
కభయంకరంబై యుండె నట్టియెడ॥ ద్వి॥ ఆసమయంబున నారా
ఘవేంద్రుఁ। డాశీవిషోపమంబగు బాణతతుల। ఘనరత్నకుండల
కలితంబులైన। దనుజేంద్రు తలలెల్ల ధరణిపైనిండ। మతిమీర నూ
టొక్కమారు ఖండింప। నతివేగమున నొప్పె నన్నియు మొలచి।
శ్రీరాముఁ డంతట చిత్తంబులోన। భూరివిస్మయ మొంది పొసగ చిం
తించి। మరల ధైర్యము జెంది మహోగ్రుఁ డగుచు। కరమొప్ప సమ
రంబు గావించె నప్పు। డిరువు రుద్ధతితోడ నేపు దీపింప। సరిపోరి ర
త్యంతసాహసులగుచు। తొలఁగక సప్తరాత్రులు యవిచ్ఛిన్న। సమ

లితాహవమిట్లుసలుపుచోనింద్ర । సారథి శ్రీరాముచయ్యాజూచి ॥
శ్రీరఘువంశాధీశ శ్రితదోషనాశ । కారుణ్యసాగరకళ్యాణవేష ॥
ధరణి బ్రాకృతుమాడ్కి తగనెంత సేపు । దురము చేసెదరిట్లు తుల్యా
పూనట్లు । దనుజాయుండైనయీదుష్టాసురునకు। నిధనమయకాలం
బు నేడు చేకూరె । బ్రహ్మాస్త్రమును వేగమున సంధించి । బ్రహ్మా
ఘ్నుడగువీనిభంజింపుము ౨ మునివరియగస్త్యసన్మునిమహాకరుణ
దనరనిచ్చినశత్రుదమన ౨ ... । పరమేష్ఠినిర్మిత భాసురాస్త్రం
బు। వరనిష్టసంధించివానరుల్ బాగడ । వెరచిభూతములెల్ల వెస
భారనిండ్రు । దరుదారదంభోళిన ద్రిపై సేయు। తెరగున తెగదీసి
తెగువమీరంగ। నెరిసమంత్రకముగా నేపున నేసె

క ॥ ఘనకాలాగ్నిజ్వాలలు । దనరగనద్దివ్య శరము దగ్రతజని
యా। దనుజేంద్రునివక్షస్థల । మునువుగ భేదించిచొచ్చెనమ్ముల పొ
దిలోన్ ॥ గీ ॥ దనుజనాథుండు ప్రాణముల్ తత్క్షణమున। విడిచెనం
తటకాయంబుపుడమిబడియె । తొలగిపారిరినిశిచరుల్ తొట్రుపడుచు
ను। వానరచయంబులత్యుత్సవమునజెందె॥

రాగము-ఆదితాళము-

అప్పుడవేల్పులత్యంతహర్షమొందిరి । చయ్యన మహాఘనాలా
త్యుత్సవమునజెందిరి॥ సరగునదుందుభులుదివినిచాలమ్రోసెను।ప
రిమళసద్గంధవహుడుపరగవీచెను ॥ ౧ ॥ గరిమతో శ్రీరామస్తుతు
లుకలయవెలసెను। విరులవానరఘుపతిపై వేడ్కగురిసెను ॥ ౨ ॥
పాడిరిగంధర్వవరులుభక్తితోడను । ఆడిరిదివ్యాప్సరసలందముగ
ను ॥ ౩ ॥ ప్రీతులగుచు ప్రజలుముక్తభీతులగుచు। ఖ్యాతిగనొప్పిరి
రంగనేతదలచుచు ॥ ౪ ॥ సీ ॥ అనిలోసమున్నతప్రతాపసురుడగ
టాచిన విజయమొందినదేవవిభునిమాడ్కి। రణరంగముననుదగ్ర
తరావణునిజంపివిలసిల్లుశ్రీరాము వేడ్కగాంచి । గరిమవిభీషణక
మలాప్తపుత్రాదులారాఘవేశ్వరునభినుతించి । పూజ యొనరిచి
రింపుననంతవానరుల్ కిలకిలాశబ్దముల్ వెలయనొప్పి । రట్టిమొద
కొండపోలికనవనిమీద। నొరిగిపడియున్నరాక్షసేశ్వరునిజూచి ॥

